NABIYON-Ke-HALAAT
(Telugu)

# దైవ ప్రవక్తలు

[నాలుగవ భాగం]

# హజ్రత్ మూసా (అలైహిస్సలాం)

# జీవిత చరిత్ర

మూలం :

మౌలానా అబూ సలీం అబ్దుల్ హై

అనువాదం :

ముహమ్మద్ ఇఖ్బాల్ అహ్మద్




తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్

లక్కడ్‌కోట్, ఛత్తాబజార్,

హైదరాబాద్–500 002

అపార కరుణామయుడు పరమకృపాశీలుడు అయిన అల్లాహ్ పేరుతో

# ఈజిప్ట్‌లో ఇస్రాయీల్ సంతతి

దైవ ప్రవక్త హజ్రత్ యూసుఫ్ (అలైహిస్సలాం) తన తండ్రి హజ్రత్ యాఖూబ్ (అ)ను, తన సోదరులందరినీ సిరియా నుండి ఈజిప్టుకు పిలిపించుకున్న విషయం పాఠకులు, హజ్రత్ యూసుఫ్ (అలైహిస్సలాం) గాథలో చదివేఉన్నారు. ఆ రోజుల్లో ఈజిప్టులో సామాన్య పౌరులంతా ముష్రికులే (దేవునికి ఇతరులను సహవర్తులుగా నిలబెట్టే వారు). వారు అనేక దేవతల్ని పూజించేవారు. "ఆమన్‌ర" అనే సూర్య దేవతను వారు తమ పెద్ద దేవతగా కొలిచేవారు. వారు తమ చక్రవర్తులను దైవాంశ సంభూతులని తలంచేవారు. దేవుడు పాదుషా రూపంలో భూమికి దిగి వస్తాడనే నమ్మకం వారిలో కలిగించబడింది. అందువల్ల వారిచేత రాజులకు పూజలు జరిపించబడేవి. వీరు రాజులను ఫిర్ఔన్‌లు అనేవారు. ఫిర్ఔన్ అంటే సూర్యదేవత అవతారం అని అర్థం. హజ్రత్ యూసుఫ్ (అలైహిస్సలాం)తన కుటుంబంవారిని ఆ బహుదైవారాధకులకు దూరంగా ఒకచోట నివాసం కల్పిం

చారు. హజ్రత్ యాఖూబ్ (అ) కు కూడా,
ఆ విగ్రహారాధకులతో కలిసి కాఫిర్లు అయిపోతారేమో
పట్టుకుంది ఆయన తన అవసానదశలో
కుటుంబంలోని వారందర్నీ పిలిచి, "చూడండి
మీరు మీ విశ్వాసాన్ని వదలిపెట్టకండి,
ఆచారాలను పాటించకండి" అని హితబోధ చేశా
మార్గంలో స్థిరంగా ఉంటామ"ని వారందరి
తీసుకున్నారు. ఈ సంఘటనను దివ్య ఖుర్
ఇలా ప్రస్తావించాడు:

యాఖూబ్ (అ) మృత్యు దశలో తన సం
అడిగాడు, "బిడ్డలారా! నా తరువాత మీరు ఎవ
వారంతా సమాధానం చెప్పారు, "మీరూ,
ఇబ్రాహీం, ఇస్మాయీల్ మరియు ఇస్‌హాఖ్ ఎవరి
భావించారో, ఆ ఒక్క దైవాన్నే మేమూ ఆరాధి
ఆయనకే ముస్లిములయి ఉంటాము".

(అల్

హజ్రత్ యాఖూబ్ (అలైహి)ను 'ఇస్రాయీల్
అనేవారు. కాబట్టి ఆయన సంతతివారు 'బనీ ఇస్రా
యులు' అని పిలువబడ్డారు. ఇస్రాయీల్ సంతతి
కుటుంబాలు ఈజిప్టులో నివసించసాగాయి. వారి
కొద్దీ ఈజిప్టులో వారొక శాశ్వత జాతిగా పరి
సుమారు 400 ఏండ్ల తరువాత దైవప్రవక్త
(అలైహిస్సలాం) ఈ జాతిలో జన్మించారు. ఆ
వ్యవధిలో ఇస్రాయీల్ సంతతి వారి స్థితి చా

పోయింది. ఒకవైపు వారి విశ్వాసంలో మాంద్యం ఏర్పడింది. ధర్మం (ఇస్లాం) బలహీనమవసాగింది. మరోవైపు వారి ఆర్థిక స్థితి క్షీణించ సాగింది. క్రమంగా అనేక బానిస జాతిలా అయిపోయింది. ఈజిప్టు వారు రాజ్యమేలగా ఇస్రాయీల్ సంతతి వారి సేవకులుగా, బానిసలుగా మారిపోయారు. అన్ని విధాలా హీనులయిపోయారు వారు. అధికారం, సిరి సంపదలు, ఈజిప్టువారి హస్తగతమయ్యాయి. వారు ఇస్రాయీల్ జాతిపై అనేక విధాలుగా జులుం చేసేవారు. అంతేకాదు, ఈజిప్టు రాజు ఫిరౌన్, బనీ ఇస్రాయీల్ శక్తి సామర్థ్యాలు వారి జనాభా పెరగడాన్ని సహించలేక పోయేవాడు. వీరు అధిక సంఖ్యాకులయితే శత్రుపక్షాన చేరి తన దైవత్వపీఠానికి ఎక్కడ ఎసరు పెడతారోనన్న భయం అతనికి ఉండేది కాబోలు. అందుచేత ఆ దుష్టుడు వారి శక్తిని అణచివేయడం కోసం వారిపై పెద్ద మొత్తంలో పన్నులు విధించడమే గాక వారిచేతే అడ్డమయిన చాకిరి చేయించడం, ఇంకా పొలాలలో కఠినతరమయిన పనులు చేయించి వారి జీవితం దుర్భరం, దుస్సహం చేశాడు. అంతటితో తృప్తిపడక బనీ ఇస్రాయీల్ బలం తగ్గాలంటే వారి సంఖ్యను కూడా తగ్గించాలని నిర్ణయించుకున్నాడు. ఆ దురాత్ముడు బనీ ఇస్రాయీల్ వారి ఇండ్లలో దాదులుగా (మంత్రసానులు) పని చేసే స్త్రీలకు ఓ ఆజ్ఞ జారీ చేశాడు— ఆ ఇండ్లల మగపిల్లవాడు జన్మిస్తే వెంటనే గొంతు పిసికి చంపేయమనీ; ఆడపిల్ల పుడితే ఉండనివ్వమని !

చాకిరీ చేయించుకోడానికి బాలికలు చాలని, ఈ రకంగా చేస్తే కొంత కాలానికి ఇస్రాయీల్ వంశమే నశిస్తుందని ఫిరౌన్ ఉద్దేశ్యం.

దీన్నిబట్టి ఆనాటి ఈ రెండు జాతుల స్థితిగతులు కంటివో అర్థం చేసుకోవచ్చు. ఓ వైపు కొద్దిమంది ముస్లి ఇస్రాయీల్ వంశీయులు- ఎవరి ధార్మిక విశ్వాసం సన్నగిల్లిందో, వారిలో ఎన్నో చెడులు చోటు చేసుకున్న ఈజిప్టు వారికి ఇష్టమయిన పంథాలో నడవడానికి వారు మాత్రమూ సిద్ధపడలేదు. మరోవైపు దేవతల్ని వ ముష్రిక్ జాతి. దేశంలో జీవించడానికి ఒకే జాతికి గలదని, రెండో జాతి వారిని ఏ విధంగానైనా తుదముట్టిం కృత నిశ్చయమయి ఉన్న జాతి. అటువంటి అపవిత్ర కోసం ఈజిప్టువారు అన్నిరకాల కుయుక్తుల్ని ఆచరణలో పెట్టారు. కొట్టడం, తిట్టడం, దోచుకోవడమయితే స ఇప్పుడు వారిని సమూలంగానే తుడిచిపెట్టాలని నిర్ణం కున్నారు– అంతటి నాజూకు పరిస్థితులలోనూ దిగజారిపో ఒక జాతికి అల్లాహ్ ఉన్నతి ప్రసాదించాడు. జులుం వారి శక్తిని నిర్వీర్యం చేసి పతనావస్థలో ఉన్న వారి లేవనెత్తాడు. సర్వాంధకారంతో విర్రవీగే వారు మట్టి కర వచ్చింది.

ఈ విషయాలన్నీ హజ్రత్ మూసా (అలైహిస్స గాథలో వస్తాయి. ఒక జాతి హీనదశకు, క్షీణదశకు, ఎ చేరుతుందో, వాన్ని అవమానం, అష్టకష్టాలనుండి కాపాడి ప్రపంచంలోనూ ఉన్నత శిఖరాగ్రానికి చేర్చే పరిస్థితులేవో కులకు సవివరంగా తెలియగలవు. అంతేకాదు, దైవ ధి నికి పర్యవసానమేమిటో సమయం వచ్చినప్పుడు ఒక రాజ్యం ఎలా నలిపి దూరంగా గిరవాటు వేయబడుతుందో ఈ గాథలో వినవచ్చు కాగలదు.

# రాజమహలులో పెంపకం

ఈజిప్టు రాజు ఫిరౌన్, ఇస్రాయీల్ వంశంలో మగపిల్లలు పుట్టగానే చంపించేసి వారి వంశ నాశనానికి పూనుకున్నాడు. కాని దైవలీల చూడండి— సరిగ్గా ఆ కాలంలోనే హజ్రత్ మూసా (అలైహిస్సలాం) జన్మించారు. ఎవరి చేతులపై, సుదూర భవిష్యత్తులో ఫిరౌన్ అంతం కావల్సి ఉందో, ఎవరి శిక్షణ ద్వారా బనీ ఇస్రాయీల్ వంటి బలహీన జాతికి ప్రపంచాధిపత్యం లభించనున్నదో ఆ మహా వ్యక్తే జన్మించారు. ఇంకా, మూసా (అలైహి) ఆపట్టణంలోనే జన్మించారు—ఎక్కడయితే ఫిరౌన్ రాజ్యం ఏలుతున్నాడో, మరెక్కడయితే ఇస్రాయీల్ సంతతిని పుట్టగానే చంపివేయమనే శాసనం అమల్లో ఉన్నదో. జనన సమయంలో ఆయన తల్లి దాదిని పిలువలేదో లేక మరేం జరిగిందోగాని హజ్రత్ మూసా (అలైహిస్సలాం) జన్మించారు. ఆయన పుట్టగానే, రాజభటులు వచ్చి పిల్లవాడ్నేం చేస్తారో అని తల్లికి భయమేసింది. ఆమె ఈ విషయంలో చింతిస్తూ ఉండగా దైవ సందేశం వినిపించింది—

"ఎంత మాత్రం భయపడవలసిన పనిలేదు. నువ్వు పిల్లవాడికి పాలుపట్టు ఒకవేళ ఎప్పుడయినా ఎటువంటి భయం

కలిగినా పిల్లవాడ్ని నిస్సంకోచంగా నదిలో వదిలిపెట్టు. మేము తన్ని తిరిగి నీ ఒడిలోనే చేర్చనున్నాము. ఇంకా అతడ్ని దైవ ప్రవక్తగా చేయనున్నాము."

ఈ సందేశం విన్నాక హజ్రత్ మూసా (అలైహి) తల్లి మనసు కాస్త కుదుటపడింది. ఆమె అల్లాహ్‌పై భారం వేసి పిల్లోడ్ని ఒక పెట్టెలో పడుకోబెట్టి నదిలో విడిచిపెట్టేసింది. వెంటనే తన కూతురితో, (మూసా (అలైహి) గారి అక్కతో) "చూడమ్మా, నీవు నది ఒడ్డునే నడుస్తూ ఈ పెట్టె ఎక్కడకు పోతుందో గమనించు" మూసా (అలైహి)సోదరి నది ఒడ్డునుండి నదిలో పోతూ ఉన్న ఆ పెట్టెను అనుసరించసాగింది.

ఆ పెట్టె నదిలో ప్రవహిస్తూపోయి ఫిరౌన్ మహలుని సమీపించింది. ఫిరౌన్ సేవకులు ఆ పెట్టెను ఒడ్డుకు తీసుక వచ్చి పెట్టెను తెరచి చూడగా లోపల ఓ చిన్నారిబాబు కేరింతల కొడుతున్నాడు. ఆ బాలుడు ఎవరి పిల్లవాడో వారికి తెలియదుగ పిల్లవాడ్ని ఎత్తుకుని మహలులోనికి తీసుకు వెళ్ళారు. ఆ పి వాడు ఇస్రాయీల సంతతికి చెందినవాడు కావచ్చు, అన్న అ మానం ఫిరౌన్‌కు కలిగింది. బాలుడ్ని చంపివేయాలని ని యించాడు. కాని ఫిరౌన్ భార్య అందగస్తుడయిన ఆ బాలు చూసి ముచ్చటపడింది. బహుశా ఆమెకు పిల్లలు లేరేవె ఆ బాబును పెంచుకోవాలని ఉబలాటపడింది. ఆమె ఫిరౌన్. "చూడండి! ఈ పిల్లోడు మనకంటి వెలుగులా అగుపిస్తున్నా ఇతడ్ని చంపనక్కరలేదు. వీడివల్ల మనకేదయినా లా చేకూరవచ్చు, లేదా మనమే ఇతన్ని పెంచుకోవచ్చు" ఆ

ఎవరిని పెంచుకోవాలని తలపోస్తున్నారో వారికేం తెలుసు? ఒక ప్రక్క ఫిరౌన్‌కు తానే దైవాన్ననే అభిప్రాయం ఉంది. మరోవైపు అతను భవిష్యత్తులో తన వంశ పారంపర్య దైవత్వ భాండం బద్దలు కొట్టబోయే వాడ్ని, ఫిరౌన్ పదవికే చరమగీతం ఆలపించే వాడ్ని తన మహలులోనే పెంచుకోవడానికి సిద్ధమవుతున్న విషయం ఫిరౌన్ గ్రహించకపోవడం గమనార్హం.

దేవుడు చేసే ఏర్పాట్లుకూడా బహు విచిత్రంగా ఉంటాయి. ఆయన ప్రజ్ఞను ఎవరెరుగును? ఏ ప్రభుత్వాన్ని కూకటి వ్రేళ్ళతో పెకలించాలో, బూటకపు దైవత్వ దర్పాన్ని ఎలా అణచాలో, దానికి ఎటువంటి అంతరంగిక విషయ పరిజ్ఞానం కావలసి ఉందో అదంతా హజ్రత్ మూసా (అలైహి) కెలా లభ్యమవుతుంది? ఇస్రాయీల్ వంశీయులు ఈజిప్టులో అత్యంత అధములుగా పరిగణించబడుతున్న రోజుల్లో ఆయన బాల్యం, పోషణ ఏర్పాటు రాజమహలులోనే గనక జరగకపోతే దేశరాజకీయాలు, రాజుగారి అంతరంగిక విషయాలు తెలుసుకునే అవకాశం బనీ ఇస్రాయీల్ కుర్రవాడికి ఎలా లభిస్తుంది!?

ఇటు ఫిరౌన్, అతని భార్య ఆ పిల్లవాడ్ని పెంచుకునేందుకు నిశ్చయించుకున్నారు. అటు, మూసా (అలైహి) తల్లికి, తన బాబును రాజమహలులోకి తీసుకెళ్ళారని తెలియగానే ఆమెలో ఆరాటం ఎక్కువ కాసాగింది. అల్లాహ్ ఆమెపై అసాధారణ కరుణచూపి ఆదుకున్నాడు గనక సరిపోయింది. లేకపోతే, కడుపు తీపికొద్దీ ఆమె అన్నీ మరిచిపోయి 'ఈ పిల్లవాడు నా కొడుకే' అని చెప్పివేసేది. అల్లాహ్ ఆమెకు ఓర్పునూ సహనాన్నీ ప్రసాదించాడు. ఆమె ఎంతో ఓరిమి వహించినా, ఫిరౌన్

జాతికి చెందిన వ్యక్తిపై జులుం జరుగుతుందని తలపోశారు. ఖిబ్తీని దుష్టుడుగా భావించి అతన్ని ఒక్క గుద్దు గుద్దారు. ఆ దెబ్బకు ఖిబ్తీ నేలకూలాడు. ఇస్రాయీలీయుడిపై దౌర్జన్యం జరుగుతున్నదని భావించిన హజ్రత్ మూసా (అలైహి) ఖిబ్తీని శిక్షించే ఉద్దేశ్యంతో కొట్టారేగాని వాడ్ని చావగొట్టాలన్న ఉద్దేశ్యం ఆయనకు ఎంత మాత్రం లేదు. ఖిబ్తీ చనిపోయినందుకు ఆయన ఎంతో విచారించారు. ఆ తర్వాత తెలిసింది అసలు సంగతి— ఖిబ్తీ చేసిన తప్పేమీ లేదు, తప్పంతా ఇస్రాయీలీయునిదేనని ఆయన మరింత కృంగిపోయారు. ఆయన గద్గద స్వరంతో, "నా వల్ల ఒక షైతాన్‌చేష్ట జరిగిపోయింది." అంటూ వెంటనే అల్లాహ్‌ను క్షమాభిక్ష కోరారు. తౌబా చేశారు. (పశ్చాత్తాపం చెందారు) "ఓ ప్రభూ! ఇంకెప్పుడూ ఏ నేరస్థుడ్ని సమర్థించను నీవు నన్ను క్షమించి నాపై దయ చూపావు."

అల్లాహ్ మానవుల మనసుల్లోని మర్మం ఎరిగిన వాడు. మూసా(అలైహి) ఉద్దేశ్యపూర్వకంగా హత్యచేయలేదని ఆయనకు తెలుసు. యాదృచ్ఛికంగా అపోహపడినందు వల్లనే ఇలా జరిగింది కనకనే దైవం ఆయన మన్నింపును స్వీకరించి ఆయన తప్పిదాన్ని క్షమించాడు.

మరునాడు కూడా మూసా (అలైహి) బజారుకు వెళ్ళినప్పుడు ఆ ఇస్రాయీలీయుడే మరోవ్యక్తితో ఘర్షణ పడుతున్నాడు. అతను మళ్ళీ మూసా (అలైహి) సహాయం కోరాడు. "నువ్వొక జగడాల మారివి... ప్రతి ఒక్కరితో పోట్లాడుతావు" అన్నారు మూసా (అలైహి).

మూసా (అలైహి) వారితగవుకు కారణం ఆరాతీయగా ఈరోజు ఇస్రాయీల్ వంశస్థుని పైనే దౌర్జన్యం జరిగిందని తెలిసింది. ఖిబ్తీ దౌర్జన్యం చేస్తున్నాడు. మూసా (అలైహి) బాధితునికి సహాయపడే ఉద్దేశ్యంతో అడుగు ముందుకు వేశారు. ఇస్రాయీల్ వంశీయుడు బహుశా మూసా (అలైహి) తననేకొట్టవస్తున్నారని భావించి, కంగారుగా "ఏయ్ మూసా! నిన్న ఒక మనిషిని చంపినట్లే నన్నుకూడా చంపాలనుకుంటున్నావా? నీ ధోరణి చూస్తుంటే, దేశంలోకెల్లా పెద్ద దుండగుడు కావాలని నువ్వు నిశ్చయించుకున్నట్లుంది. (ప్రజల్ని) సంస్కరించాలన్న ఉద్దేశ్యమే నీకు లేనట్లుంది" అన్నాడు. అతనా మాటలు అనగానే ఖిబ్తీకి, అంతకు ముందురోజు జరిగిన హత్యకు కారకులెవరో తెలిసిపోయింది. ఈ విషయం నిమిషాల్లో ఊరంతా పాకిపోయింది.

మూసా (అలైహి) కు తామంటే ఇష్టం లేదని ఆయన ప్రవర్తన ద్వారా ఫిరౌన్ దర్బారు వారు గమనించి ఉండవచ్చు. ఫిరౌన్‌కు కోపం కలిగించడానికి మూసా (అలైహి) చేసిన ఈ ఒక్క పనిచాలు. రాచకుటుంబానికి చెందిన ఒక వ్యక్తికి వ్యతిరేకంగా ఇస్రాయీల్ జాతి వాడ్ని — బానిస జాతి వాడ్ని — మూసా (అలైహి) సమర్థించడాన్ని వారు సహించలేక పోయారు.

దీని సాకుతోనే మూసా (అలైహి)ను తుదముట్టించాలని ఫిరౌన్ అంతరంగికులు పన్నాగాలు పన్నసాగారు. కాని చెడ్డ వాళ్ళున్న చోటే ఎవరో ఒకరు మంచివారు కూడా ఉంటుంటారు. వారిలోని వాడే అయిన ఒక వ్యక్తి — పురుషులందు పుణ్య పురుషులువేరయా అన్నట్లు — మూసా (అలైహి)లోని సద్గుణాలను తెలిసిన వాడవటం వల్ల. ఈ హత్య స్వరూప స్వభావాలు కూడా

ఎరిగినవారు గనక, హుటాహుటిన హజ్రత్ మూసా (అలై
వెళ్ళి ఫిరౌన్ దర్బారులో జరిగే కుట్రను గురించి అం
వేశారు. "ఫిరౌన్ సలహాదార్లు నిన్ను తుదముట్టించా
పన్నుతున్నారు. నేను నీ శ్రేయాన్ని కాంక్షించే వా
చెబుతున్నాను. నా సలహా మేరకు నువ్వు పట్టణ
వదాంగా ఎక్కడికయినా పారిపో."

మూసా (అలైహి) ఇది విన్న వెంటనే ఆ నగ
పెట్టారు వెనుకనుంచి ఎవరయినా వచ్చి పట్టుకుంటా
భయపడ్డారు. అల్లాహ్‌ని ఈ విధంగా ప్రార్థించారు

"ఓ ప్రభువా! ఈ దుష్టుల బారినుండి నన్ను

నిజమే. విశ్వాసి అన్నివేళలా అల్లాహ్‌నే అ



# మద్‌యన్ యెమన్ లో శిక్ష

మూసా (అలైహి) ఈజిప్టునుండి బయలుదేరి
(యెమన్) వైపుకు సాగిపోయారు. ఈ ప్రదేశం ఎర
నికి తూర్పు వైపున ఫిరౌన్ రాజ్యానికి వెలుపల ఉంది
నివసిస్తున్న వారు హజ్రత్ ఇబ్రాహీం (అలైహి)

ందినవారే. ఆ విధంగా వారు హజ్రత్ మూసా (అలైహి) కు
ర బంధువులే. అందుకే కాబోలు ఆయన తగిన ప్రదేశంగా నిర్ణ
ంచుకున్న ఈ ప్రాంతాన్ని చేరుకోవడానికి ఆయత్తమయ్యారు
ూసా (అలైహి) ఒంటరిగా పయనమయ్యారు. తోడుగాని
ాయకులుగాని ఎవరూ లేరు. పైగా శత్రువు వెనుక నుండి
చ్చి చుట్టుముట్టే భయం అనుక్షణం వెంటాడుతోంది. కాని
జ్రత్ మూసా (అలైహి) హృదయంలో "నా ప్రభువు నన్ను
యిన మార్గం (సన్మార్గం) లోనే నడిపిస్తాడు" అనే విశ్వాసం
క్షమయింది. అందుకే నిస్సంకోచంగా ముందుకు సాగారు.

అలా నడుస్తూ నడుస్తూ ఆయన మద్యన్ (యెమన్)కు
ందిన ఒక బస్తీ సమీపానికి చేరుకున్నారు. అక్కడ ఒక
ావి ఉంది. బావివద్ద చాలామంది గుమిగూడి తమతమ పశువు
కు నీరు త్రాగిస్తూ ఉన్నారు. అక్కడే కాస్త దూరంలో ఇద్దరు
ాలికలు తమ పశువుల్ని నిలబెట్టి నిరీక్షిస్తూ కనిపించారు.
ూసా (అలైహి) వారితో, "ఏం మీరిలా దూరంగా ఎందుకు
లబడ్డారు" అనడిగారు.

"ఈ పశువుల కాపరులు వారిపశువుల్ని నీరు త్రాగించనిదే
ేమెలా త్రాగించగలం? వారికంటే మేము బలహీనులము.
ా నాన్నగారు కూడా ముసలివారు" అన్నారా బాలికలు.

బలవంతులు బలహీనుల హక్కులను దోచుకోవడాన్ని
హజ్రత్ మూసా (అలైహి) చూచి సహించలేక పోయారు.
ెంటనే ఆయన ఆ పశువులను బావి దగ్గరకు తీసుకెళ్ళి నీరు
ాగించారు. పశువులు నీరు త్రాగాక ఆయన దగ్గర్లోని ఒక

...ష్టు సీతను ఆశ్రయించి తన ప్రభువుతో, "ఓ ప్రభూ నాకైపు వంకే శ్రేయస్సును కాంక్షిస్తున్నాను'' అని వేడు

చూడ్డానికిది చాలా చిన్న విషయమే. దైవ మూసా (అలైహి) బలహీనులయిన బాలికలకు సా వారి పశువులకు నీరు త్రాగించారు సరే! అనేక స చేశారు. అయితే కాస్త సావధానంగా ఆలోచించి అల్లాహ్ ఈ చిన్న విషయం ప్రసక్తి తీసుకువచ్చి ఒక గొ వాన్ని మానవులకు స్పష్టం చేశాడని అర్థమవుతుంది. విషయం; గాలి, నీరు, సూర్యరశ్మి, వర్షం, సముద్రాలు, దానంతట అవే మొలిచే గడ్డి అడవులు, భూమిలోని ...నుపవి దైవప్రసాదితాలు గనక, వాటిని అనుభవి మానవుడు ఎలాంటి శ్రమ పడనవసరం లేదు. ... ఏ ప్రత్యేక వ్యక్తి యొక్క వ్యక్తిగత ఆస్తి కాకూడదు. వనరుల పంపకంలో "కర్రగల వాడిదే బర్రె" అనే సరియైనది కాదు. ఇవి సాధారణంగా మానవుల అ ...బట్టి పంపకం కావాలి. కాని కల్లోలం అసలు ఇ ఆరంభమవుతుంది. తమకున్న బలం చేత కొందరు దైవానుగ్రహాల్ని చేజిక్కించుకొని, ఇతరుల హక్కు నిర్లక్ష్యం చేయడం జరుగుతుంది. దైవ సమ్మతమైన వ్యవస్థ మాత్రమే మానవుల్ని ఈ శాపం నుండి విము దిస్తుంది. మూసా (అలైహి) భవిష్యత్తులో ఇటువంటి సుస్థాపితం చేయవలసి ఉంది. అందుచేతనే బ బలహీనుల హక్కుల్ని దోచుకోవటాన్ని ఆయన స పోయారు.

ఆ బాలికలు ఇంటికి వెళ్ళి తండ్రికి జరిగిన విషయమంతా వివరించారు. కృతజ్ఞతా భావం వెల్లివిరియగా తమ కుమార్తెలకు సహాయపడిన ఆ సానుభూతిపరుడ్ని కలుసుకోవాలని తలచాడా తండ్రి. ఆ యువకుడ్ని తన దగ్గరికి పిలుచుకు రమ్మని ఒక అమ్మాయిని పంపారు. ఆ బాలిక మూసా (అలైహి) దగ్గరకు వచ్చి, "మా పశువులకు నీరు త్రాగించి మాకు చేసిన మేలుకు కృతజ్ఞతగా ప్రతిమూల్యం చెల్లించేందుకు మా నాన్నగారు మిమ్మల్ని పిలుస్తున్నారు" అన్నది.

మూసా (అలైహి) ఆ బాలిక వెంట నడిచారు. ఆ బాలికల తండ్రితో తన గాధనంతా చెప్పుకున్నారు. అంతా విని ఆయన 'మీరేమీ భయపడనవసరం లేదు. నిశ్చింతగా ఉండండి. ఇక మీరు ఆ దుర్మార్గుల కబంధ హస్తాలనుండి విముక్తి పొందినట్లే' అన్నారు.

వారి ఇంటనే మూసా (అలైహి) కొన్నాళ్ళు ఆగారు. ఒక రోజు ఇద్దరు కుమార్తెలలో ఒకామె తండ్రితో, "ఆ యువకుడ్ని మనవద్ద ఎందుకు కొలువు ఉంచుకోరాదూ! పైగా బలవంతుడూ అమానతుదారుడు అయిన నౌకరే కదా మనకు కావల్సింది !!'' అన్నది. ఈ ప్రతిపాదన ఆ తండ్రికి ఎంతో నచ్చింది. ఆయన బాగా ఆలోచించి ఒక మంచి నిర్ణయానికి వచ్చారు. ఓ రోజు ఆయన మూసా (అలైహి)తో అన్నారు, "నా ఇద్దరమ్మాయిలలో ఒకామెను నీకిచ్చి నికాహ్ (వివాహం)జరిపించాలనుకుంటున్నాను అయితే ఒక షరతు, నువ్వు ఎనిమిదేండ్లు నా దగ్గర ఉద్యోగం చేయాలి. ఒకవేళ పదేళ్ళు గనక పూర్తి చేస్తే నువ్వు నాకు మేలు చేసిన వాడవవుతావు. అలా అని నీపై ఎక్కువ భారం

చెయ్యడం నాకు ఇష్టం లేదు కూడా. దైవ చిత్తమయి స్వేచ్ఛలో నీవు నన్నొక మంచి మనిషిగా గుర్తిస్తావు. మూసా (అలైహి) ఆ పెద్దాయన చేసిన ప్రతిపాదనకు తన కారం తెలుపుతూ, "మనిద్దరిమధ్య ఈ ఒప్పందానికి నేను చిస్తున్నాను. ఈ రెండు గడువుల్లో మీరు కోరిన గడువును చేయడానికి నాకేమీ అభ్యంతరం లేదు. మనం ఏ ఒ మయితే కుదుర్చుకుంటున్నామో దానికి అల్లాహ్ సాక్షి కుంటాం. ఆయన మీదే మనకు విశ్వాసం" అన్నారు.

ఆ బాలికల తండ్రి దైవప్రవక్త హజ్రత్ షుఐబ్ (అ మే అని అంటారు అల్లాహ్ చేసే ఏర్పాట్లు చూ ఇప్పటివరకు మూసా (అలైహి)ను ఫిరౌన్ దర్బారులో పె దేశ రాజకీయ వ్యవహారాల్ని అందరి మెలకువల్ని నే అవకాశం ఆయనకు కల్పించాడు. ఇక ఇప్పుడు మరో లేక పది సంవత్సరాలు మరొక ప్రవక్త సహచర్యంలో వీలు కల్పించాడు. వాస్తవానికి ఈ 8 లేక 10 ఏళ్ళ కేవలం మేకల్ని, ఒంటెల్ని మేపడానికి మాత్రమే కాదు. తన ఏ ఉన్నత కార్యం కొరకయితే హజ్రత్ మూసా (అ న్నుకున్నాడో దానికోసం ఆయన్ని సన్నద్ధం చేయవలసి వాక ఉద్దేశ కాలమన్నమాట.



# దైవ దౌత్యం

హజ్రత్ మూసా (అలైహి) నౌకరీ చేయవలసిన గడువు పూర్తయింది. వివాహంకూడా జరిగిపోయింది. అప్పలు ముఖ్యంగా సోదరుడు హారూన్ (అలైహి)ను చూడాలని మనస్సు తహ తహ లాడింది. దాంతో మూసా (అలైహి) స్వదేశం వెళ్ళడానికి, నిర్ణయించుకున్నారు. మామగారి అనుమతితో, భార్య వెంట రాగా ఈజిప్టుకు పయనమయ్యారు. దారిలో ఒక అద్భుత సంఘటన—

చీకటి రాత్రి, మంచు బాగా కురుస్తోంది. ఎటు వెళుతున్నారో దారి తెలియటం లేదు. అకస్మాత్తుగా ఆయనకు కొండమీద అగ్ని మంట కనిపించింది. ఆయన తన అర్ధాంగితో "నువ్విక్కడే ఉండు. నేను వెళ్ళి కొద్దిసేపట్లో నిప్పు తీసుకు వస్తాను. దాంతో నువ్వు చలికాచుకోవచ్చు. ఆ మంట దగ్గిర ఎవరయినా కనబడితే బహుశా దారికూడా తెలుసుకోవచ్చు." అని ఆమెను అక్కడే విడిచి మంట కనబడిన వైపుకు వెళ్ళారు.

హజ్రత్ మూసా (అలైహి) నిప్పు తెచ్చుకోవాలన్న ధ్యాసతో ముందుకు సాగిపోతున్నారు. దైవ ధర్మాన్ని గురించి ఆయనకు ఏ మాత్రం తెలియదు. నిజమే తనకు ప్రవక్త పదవి లభించ

నుంది అని ఆయనకు మాత్రం ఏం తెలుసు ? మంట ఎ
కనబడుతూంది. హఠాత్తుగా పెళ్ళేసరికి ఎవరో పేరుపెట్టి పి
"ఓ మూసా ! అని. ఆయన ఉలిక్కిపడ్డారు. తెలిసి
ఎవరూ లేనిచోట, నన్నెరిగిన వాళ్ళు, పేరుపెట్టి పిలిచే
ఎవరయి వుంటారా అని ఆలోచనలో పడ్డారు. అంతలో
సారి అదే పిలుపు !

"మూసా నీ ప్రభువును నేనే. పాదరక్షలు విడువు.
నీవు పవిత్రమైన తువా లోయలో ఉన్నావు. ఇటు
నిన్ను ప్రవక్త పదవి కోసం ఎన్నుకున్నాను. ఇప్పుడు నేన
దంతా సావధానంగా విను.

'నేనే అల్లాహ్ను. నేను తప్ప ఆరాధనీయులు
లేరు. కాబట్టి నన్నే ఆరాధించు.

నా స్మరణ కోసం నమాజ్ ను స్థాపించు.

ఖియామత్ (తుదిదినం) తప్పక వస్తుందని నమ్ము
నేను ఆ విషయాన్ని గుప్తంగా ఉంచాను. తద్వారా ఎవ
పని చేస్తారో తెలిసిపోవాలని అలా చేశాను.

మరణానంతరం ప్రతి వ్యక్తికి అతని కర్మల ప్ర
ఇవ్వబడుతుంది.

ఇంకా విను. ఒకవేళ ఎవరయితే ఆ రోజు
దని విశ్వసించరో, తమ కోర్కెలకు దాసులయి ఉంటా
నా ఆరాధనా విధేయతలనుండి నిన్ను నిరోధిస్తారేమో

ఒకవేళ నువ్వలా చేస్తే, నాశనమయి పోతావు.'
(సూరయె

మూసా (అలైహి) ఆ మాటలు విన్నారు. తనకు ఎటువంటి గౌరవోన్నతలు ప్రసాదించబడుతున్నాయో గ్రహించారు. మానవులందరిలో తనకు ఎంతటి అత్యున్నతస్థానం లభించబోతున్నదో దాంతోపాటు తనపై మోపబడుతున్న బాధ్యత ఎటువంటిదో కూడా ఆయన తెలుసుకున్నారు. హజ్రత్ మూసా (అలైహి) మౌనంగా నిలబడి వినసాగారు.

ఒకవేళ ఆయనతో సూటిగా ఒక ప్రశ్న వేయబడకుంటే నట్లయితే బహుశా ఆయన అలాగే మౌనదశలో నిలబడి ఉండేవారేమో !

సరే, అల్లాహ్ ప్రశ్న, దానికి మూసా (అలైహి) జవాబు చదివేముందు, కాస్త ఆ వహీ (దైవసందేశం) ఏమిటో తెలుసుకుందాం. మూసా (అలైహి)ను ఎన్నుకుని ఆయన ద్వారా ఇతర మానవాళికి అందజేయబడనున్న ఆ దివ్య సందేశాన్ని అర్థం చేసుకుందాం.

అన్నింటికన్నా ముందు, ఈ శబ్దం ఎవరిదో, ఎక్కడ్నుంచి వస్తున్నదో పరిచయం చేయబడింది. ఇంకా మూసా (అలైహి) నిలబడి ఉన్న స్థలం ఏ ప్రాంతంలోనిదో తెలుపబడింది. దివ్య ఖుర్ఆన్‌లో మరొకచోట ఇదే విషయాన్ని ఇలా కూడా ప్రస్తావించడం జరిగింది.

ఆయన మంటకు దగ్గరగా వెళ్ళినప్పుడు ఇలా వినబడింది: "మంట దగ్గర ఉన్న వానికి ఇంకా, ఇదంతా జరుగుతున్న ఆ పరిసర ప్రదేశానికి శుభం కలుగుగాక !

ఇహపర లోకాల ప్రభువయిన అల్లాహ్ అన్ని
పెడులనుండి పవిత్రమయిన వాడు—ఓ మూసా !- ని
స్తున్నది నేనే- నేనే అల్లాహ్‌ని, గొప్పవాడ్ని, అత్య
వంతుడ్ని."

ఈ పరిచయం తర్వాతే, ముమ్ముందు చెప్పబడే
నికి ప్రాముఖ్యత లభిస్తుంది. ఇక్కడ దేవుడు మూసా (అ
ఒక కార్యం అప్పగిస్తున్నాడు. తనకు వినయ విధేయ
టించమని అడుగుతున్నాడు. వినేవాడు చెప్పేవాడ్ని
నట్లయితే ఆ మాటలన్నీ అర్థరహితమే.

ఇక్కడ మరో విషయం కూడా గమనించండి.
కాశాలు, సూర్యచంద్రులు, గాలి, మేఘం, వర్షం,
మొలిచే మొక్కలు, పశువులు, పక్షులు. క్రిమికీటకాలు,
మానవుని ఉనికి, అతని శరీర నిర్మాణం, అతని వ
కావలసిన ఆధారాలు, అతని ఆహారసామగ్రి, నీరు,
టేమిటి సృష్టిలో అణువణువు కూడా సాక్ష్యమిచ్చే
మేమంటే—

ఇదంతా (సృష్టి) తనకు తానుగా ఉనికిలోనికి
దాని సృష్టికర్త ఒకడున్నాడు. ఈ సృష్టి అంతా ఎంత
మరెంత నియమబద్ధంగా నిర్వర్తించబడుతున్నదో
ఈ విశ్వ వ్యవస్థను నడిపేవాడు, దాని నియమావళిని
దించినవాడు అసాధారణ శక్తిసంపన్నుడని, అసామా
రచనాగరిష్ఠుడని ఒప్పుకోక తప్పదు. సృష్టికర్త ఘ
గుర్తించే, తెలుసుకునేందుకు అవసరమైన సామగ్రి ప్ర

రకానికి అతని చుట్టుప్రక్కల ఎంతగా వ్యాపించి వున్నదంటే, అతడు
న్న పీ విధమయిన శిక్షణ, సలహాల ప్రమేయం లేకుండానే. అతని
ంత విస్తృప్రక్కంలో ప్రభువు, యజమాని యొక్క భావన ఏ కాస్తయినా
ంచ్చు తీరుతుంది. ఆలోచించవలసిన విషయమేమంటే, ఒక
విషయ్యక్తిపై ఎల్లప్పుడూ దేవుని కరుణా కటాక్షాల వర్షం వర్షిస్తూ
ంలైహి)ఉంటే అతను ఇదంతా ఏర్పాటు చేసే వారెవరూ లేకుండానే
తలు జరుగుతున్నదని భావించడంగాని, ఒకరి పోషణకు కావలసిన
గుర్తిఏర్పాటు, ఆలోచించిన కొద్దీ సంభ్రమాశ్చర్యాలు కలిగే అద్భుత
ంతిలో జరుగుతూ ఉంటే, అతడు ఇదంతా ఏ పరిపోషకుడు
భూవలేకుండానే జరుగుతున్నదనే నిర్ణయానికి రావడంగాని, లేదా స్మష్టి
భూమిలోని ప్రతి వస్తువూ, ఒక నియమానికిలోబడి, ఒక నిర్ణీత విధానం
స్వయంప్రకారం పనిచేస్తూ ఉండటాన్ని చూసినవ్యక్తి ఇదంతా ఏ
ఎనుగడ్రప్రభువూ, ఏ నిర్వాహకుడూ లేకుండానే దానంతట అదే నడు
గాలి స్తోందని అనుకోవడం మానవ స్వభావానికే వ్యతిరేకం. ఈ
విషకారణం చేతనే ప్రతి కాలంలోనూ మానవుడు ఈ సత్యాన్ని
గుర్తించాడు, కనుగొన్నాడు. మానవుడు తన మనోకాంక్షలకు
రాత్రఃబానిసయి, లేదా తన భావోద్రేకాలకు లోనయి కేవలం మంకు
చక్కతనం కారణంగా తిరస్కరిస్తే అది వేరే విషయం. మానవుడికి
గమనిదేవుని అస్తిత్వం గురించి సరయిన పరిచయం కావడానికి ఇప్పటి
రూపవరకు అడ్డు, అవరోధం అవుతూ వచ్చిన విషయమేమన్నా
'న్యవ్యూఉన్నదా అంటే అది మానవుని వికృత కోరికలు, తప్పుడు భావో
యజమాస్వ్రేకాలే. కొందరు దేవుని ఉనికినయితే అంగీకరిస్తారు. కా
తి మానఅలా దైవాన్ని అంగీకరించినందున కలిగే పనిని చేయవ

వచ్చినప్పుడు వారు ఒకవైపు దైవాన్ని విశ్వసిస్తూనే మరోవై
తమ వికృత కోరికలను, దుష్ట ఆశయాలను కూడా నెరవేర
కుంటుంటారు. లేదా అసలు దైవాన్నే తిరస్కరిస్తారు.

మొదటి తరహా ఆచరణవల్ల తప్పుడు మతం ఆవిర్భవి
రెండో తరహా ఆచరణవల్ల నాస్తికత్వం లేదా భౌతికఆరాధ
ఉనికిలోనికి వచ్చింది.

దేవుని పరిచయం, గుర్తింపుకోసం ప్రతి మానవుడికీ త
బుద్ధీ జ్ఞానాలను ఇట్టి, ఈ సృష్టిలో నలువైపులా సమకూర్చబ
ఉన్న నిదర్శనాలు ముక్తసరిగా దైవత్వ స్వరూపాన్ని సూచిస్తాం
కాని ఇది మాత్రమే చాలదు. ఆయన ఉనికి, ఆయన గు
విశేషాల అసలుజ్ఞానం దీనిద్వారా ప్రాప్తంకాదు. అల్లాహ్ త
దాసులపై ఎంతటి దయగలవాడంటే ఆయన వారి సౌలభ
కోసం కోట్లాది ఏర్పాట్లు చేశాడు. ఆయన మరో కష్టమైనదా
కూడా సులభతరం చేశాడు.

తన దాసులకోసం ఆయన తాను పరిచయంచేసిన మాన
లలో నుండే కొందరిని ఎన్నుకున్నాడు. వారికి సద్బోధల వె
గును ప్రసాదించాడు. వారే దైవప్రవక్తలు. వారి ద్వార
మానవుడు దేవుని అస్తిత్వాన్ని, గుణ విశేషాల సరయిన జ్ఞానా
పొందగలుగుతాడు. అప్పుడే ఆయన ప్రసన్నత, అప్రసన్న
విషయాల్ని తెలుసుకోగలడు.

అల్లాహ్ హజ్రత్ మూసా (అస్సలాం) కు అందరిక
ముందు ఆ పరిచయ భాగ్యాన్నే అనుగ్రహించాడు. ఇం
"మేము నిన్ను ఒక ప్రత్యేక కార్యం కొరకు ఎన్నుకున్నాము,

కోసం నడుం బిగించు. దానికి సంబంధించిన అవసరమైన వసల్ని విను" అనే శుభవార్త ఆయనకు విన్పించబడింది.

అన్నింటికంటే ముందుగా ఆయనకు ఇవ్వబడిన సూచన త ముఖ్యమైనది !

ఆ సేవ ఏమిటో, దేనికోసమైతే మూసా (అలైహి)ఎన్నుకో ారో, మున్ముందు వివరంగా తెలియగలదు—

## వైపు :—

● ఫిరౌన్ యొక్క తిరుగుబాటు (దైవ తిరస్కార) వైఖరి ానవుడ్ని మానవుడికే దాసుడుగా చేసింది. అతని మంత్రి మాన్ ద్వారా వ్యాప్తిలోకి తేబడిన (తప్పుడు) మత తత్వపు లలో మానవుని శరీరమే కాదు, ఆతని ఆత్మ సయితం చిక్కి ని ఉంది—ఇంకా

● జాతీయ పెట్టుబడిదారీ వ్యవస్థ క్రింద మానవత వి ల్లాడుతోంది. ఆ శాపానికి ప్రతినిధి-ఖారూన్-ప్రజా కంటకి య్యాడు.

## రెండో వైపు :—

ఒక పీడిత జాతి—మార్గభ్రష్టతకు గురయిన ముస్లిం జాతి— స్వదేశస్థుల చేతనే అవమానించబడుతూ, అణగిపోయి, జీవితం అంటేనే విసిగిపోయిన జాతి. దాన్ని బానిసత్వపు కోరల్లోకి లాగి, వాని రక్తం చివరి బొట్టువరకు పీల్చివేసినా శత్రువుకు తృప్తి కలగడంలేదు. పైగా ఆ జాతి సంతానాన్నే అంతమొందించే ప్రణాళికలు తయారయ్యాయి.

మూసా (అలైహి) ఒకవైపు ఫిరౌన్, హామాన్, ఖారూన్ ఎదుర్కోవాల్సి వుంది. మరోవైపు వారికీ, వారి జాతికీ సందేశం అందజేయాల్సి ఉంది. ఇంకోవైపు అణచివేయ: ఆ జాతిని ఉద్ధరించాలి. ఆ జాతిలోని చెడులను దూరం మరచిపోయిన పాఠం సర్దు చేయవలసి వుంది-ఆలోచించం ఎంత కఠినమైన పని అప్పగించబడుతోందో. అయితే, కొత్త విషయమేమీ కాదు. ఈ కార్యాన్ని నిర్వర్తించటా ఎల్లప్పుడూ ప్రవక్తలు వస్తుండేవారు. ఈ కార్యం పూర్తిచేయడ ఆయా ప్రవక్తల అనుయాయులు తమ ప్రాణాలొడ్డి పని చేశ

ఈ ముఖ్యమైన పనికి ఇవ్వబడే ఉపదేశం (ఉత్తర్వు): ముఖ్యమైనదో గమనించండి.

అల్లాహ్ ప్రవచిస్తున్నాడు.

"లాఇలాహ ఇల్లా అనా ఫాఅబుద్నీ వ అఖీముస్సలాత జిక్రీ".

"అల్లాహ్ తప్ప మరొక దైవం లేడు. అధికృత ఆయ: బలపరాక్రమాల్లో ఆయన్ని మించినవారు లేరు. కోర్కె తీర్చడం, రక్షణ ఇవ్వడం, శాంతిని ప్రసాదించడం. అం ల్లనే సాధ్యం. సర్వాధికారి ఆయనే".

"కనుక దాస్యానికి అర్హుడు ఆయనే. కేవలం ఆయ ఆజ్ఞాపించడం ప్రభువు హక్కు. ఆయనకు విధేయత చూపట సమంజసం."

యావజ్జీవితమూ ఆయన విధేయతలో స్థిరంగా ఉండటాని ఎల్లవేళలా ఆయన ఆజ్ఞల్ని పాలించేందుకు, తన నిజ ప్రభు

(దైవం) ను గుర్తించి, 2 కేవలం ఆయనకే విధేయత చూ!
దైవాన్ని విస్మరించడం వలన జరిగే అనర్థాల నుండి తన
తాను కాపాడుకోవడానికి నమాజ్‌ను స్థాపించటం అత్యవసరమ
గుర్తించే వరకూ సాధ్యం కాదు.

జీవితం మరణంతో అంతంకాదు. నాణానికి లాగే జీ
తానికీ బొమ్మా బొరుసు ఉన్నాయి. ఆ రెంటి మధ్య మరణ
హద్దుమాత్రమే. ఆ హద్దుకు ఇవతల సముపార్జనకు, ప్రయత్నా
నికి వ్యవధి, హద్దుకు అవలిప్రక్క సంపాదించిన ఫలాని
అనుభవించే కాలం వున్నాయి. ఈ వాస్తవమే గనక మానవు
దృష్టిలో ఉండివుంటే ఏ చెడులను రూపుమాపడానికి ముః
(అస్సలాం) నియమింపబడుతున్నారో ఆ చెడులు అస
పుట్టేవే కావు. కాని మానవుడు ఈ యదార్థాన్ని విస్మరిస్తున్నాడ
కోర్కెలు అతడి కళ్ళను కప్పేస్తాయి. తాత్కాలికంగా లభిం
ప్రయోజనాల మధురిమల్లో అతడు మునిగిపోయి ప్రస్తుత
కంటికి కానరాని "శాశ్వత" జీవితాన్ని మరచి పోతాడు.
మరచిపోవడమే అతని వినాశానికి కారణం. కోరికలకు బాని
లయిన వాళ్ళు, కొత్త రుచుల మైకం కమ్మినవాళ్ళు అంతటి
ఊరుకోరు. తాము నాశనమవడమే కాక తమతోపాటు ఇతరు
కళ్ళకూడా కప్పడానికి ప్రయత్నించి వారి మార్గంలోనూ అ
ధం కల్పిస్తారు.

ఈ మొట్టమొదటి వహీ (దైవ సందేశం) లో హజ్ర
సా (అస్సలాం) ను, "పరలోకాన్ని విస్మరించిన ఈ ప్రజ
న్ను వినాశకర మార్గంలోకి ఈడుస్తారేమో !" అనే ప్రమాదాని
కూడా ముందుగా సూచించి హెచ్చరించడం జరిగింది.

హజ్రత్ మూసా (అస్సలాం) కు ఇవ్వబడిన దైవ సందేశాన్ని గమనించండి. ఇందులో మానవులందరికీ గుణపాఠం, మార్గదర్శకం లభింపజేసే సామగ్రి ఎంతోవుంది.

మూసా (అస్సలాం) మౌనంగా దైవవాణి వింటూ నిలబడ్డారు. ఇంతలో ఆయన్ని ప్రశ్నించడం జరిగింది.

"ఓ మూసా ! నీ కుడిచేతిలో ఏముంది ?"

"ఇదీ నా లాఠీ (కర్ర) ఊతగా దీన్ని ఉపయోగిస్తాను. ఇంకా దీంతో మేకల కోసం ఆకులు రాల్చుతాను. దీంతో నా అవసరాలు ఇంకా ఎన్నో తీరుతాయి", హజ్రత్ మూసా జవాబిచ్చారు:

"దాన్ని నేలమీద పడవేయి"- ఆజ్ఞ అయింది.

మూసా (అస్సలాం) ఆజ్ఞను పాటించారు. కర్రను పడవేసిన చోట ఒక పాము అటూ ఇటూ జర జర ప్రాకుతోంది. దాన్ని చూసిన మూసా గాబరాపడి, వెనుదిరిగి పారిపోసాగారు. వెంటనే, "మూసా ! ముందుకు వచ్చి దాన్ని పట్టుకో. భయపడకు. నీవు క్షేమంగానే ఉంటావు. చూడు ! మేము దానిని తిరిగి మొదట ఎలా ఉందో అలానే చేస్తాము. మా ప్రవక్తలు మా సముఖంలో భయపడరు." అని వినవచ్చింది.

మూసా (అస్సలాం) ఈ ఆజ్ఞను పాటించారు. ముందుకు అడుగువేసి ఆ పామును పట్టుకున్నారు. ఇప్పుడు పాము మాయమయిపోయింది. మూసా (అస్సలాం) చేతిలో లాఠీ ఉంది ఎప్పటిలాగానే. ఇంతలో మళ్ళీ "నీ చేతిని కాస్త నీ చంకలో పెట్టుకో, నీచేయి ఉజ్వలమైన కాంతిని వెదజల్లుతుంది–

కే మాత్రం లోపం లేకుండా. ఇది నీవు నిజంగా దైవ ప్రవక్తవని తెలిపే రెండవ చిహ్నం. నువ్వు వెళ్ళి ఈ రెండు గుర్తుల్ని ఫిరౌన్‌కు, అతని దర్బారులోని వారికి, అతని జాతివారికి చూపు. వారిని దైవ తిరస్కారం, అవిధేయతల నుండి మరల్చేందుకు నీ ప్రభువు తరఫునుండి ప్రసాదించబడుతున్నాయి. వారు ఎంతో అవిధేయులు, తిరస్కారులు అయిపోయారు. ముందు ముందు మేము నీకు మరిన్ని మహిమల్ని చూపుతాము." అని వినబడింది.

హజ్రత్ మూసా (అలైహి) దైవ ప్రవక్తగా నియుక్తమయ్యారు. అంటే మానవులలో అత్యంత ఉన్నతమైన స్థానం ఆయనకు లభించింది. దైవంతో సంభాషించిన ఘనత, ప్రవక్త పదవికి నిదర్శనంగా రెండు మహిమలు ఆయనకు లభించాయి. అయితే ఎవరికి కీర్తి ప్రతిష్టలున్నాయో వారికి బాధ్యతలూ ఉన్నాయి.

ఇప్పుడు మూసా (అస్సలాం) నిర్వర్తించవలసిన బాధ్యతలను కాస్త చూడండి. నిజానికి ప్రాపంచిక జీవితం ఏ విధంగానూ సుఖశాంతుల జీవితం కాదు. ఈ జీవితం బాధ్యతల్ని నెరవేర్చే గడువుమాత్రమే. విధి నిర్వర్తించ వలసిన సమయం. ఎవరి హెూదా ఎంత ఉన్నతమైనదయితే వారిపై బాధ్యత కూడా అంతే ఎక్కువగా ఉంటుంది. మూసా (అస్సలాం) కు ఆజ్ఞాపించ బడింది :

"వెళ్ళు. ఫిరౌన్ వద్దకుపో. అతనెంతో తల బిరుసుతనాన్ని ప్రదర్శిస్తున్నాడు. అతని ఆ స్థానంలోని వారు, అతని జాతివారు హద్దుమీరి పోయారు. అమితమైన అన్యాయాలకు, దౌర్జన్యాలకు పాల్పడ్డారు. "మీకు దైవ భయం లేదా ?" అని

వారిని అడుగు, "నీ జీవితం పవిత్రవంతం కావాలని కోరుకుం టున్నావా? అయితే నీ నిజ ప్రభువు యజమానికి ఇష్టమైన, జీవిత మార్గం నీకు చూపనా? అని ఫిరౌన్‌ని అడుగు."

ఈ ఆజ్ఞ వినగానే హజ్రత్ మూసా (అస్సలాం) భయతో కంపించి పోయారు. ఎంత పెద్ద బాధ్యత. ఆయనపై మోపబడు తోందో!

ఫిరౌన్! ఈజిప్టు దేశానికిఏకైక యజమాని. అతని అధి కారాలకు అంతులేదు. అతనిచుట్టూ యుక్తిపరులైన సర్దారుల సమూహం ఉండేది. యూదజాతి అతని గుప్పిటిలో బంధించ బడి ఉన్నది. కనుసైగలతో వారిని ఆడించగలడతను. ఆ కాలంలో మానవ బలం, అధికారం అత్యున్నత స్థాయిలో అతనికి ప్రాప్తమైంది. కాగా, ఇటు హజ్రత్ మూసా (అస్సలాం) ఏకాకి. అనుచరులు ఎవరూ ఆయన వెంటలేరు. అధికారం, డబ్బు, సంగతి అటుంచి బ్రతుకుతెరువు కోసం కొన్ని పశువులు తప్ప మరే ఆధారమూ లేదు. పైగా ఎంతోకాలంగా దేశం విడిచిపెట్టి ఉన్నా ఇప్పటిదాకా పశువుల కాపరిగా జీవితం గడిపినవాడు. ఈజిప్టు దేశపు భాషకూడా దాదాపు మర్చిపోయిన వాడు. అటువంటి ఆయనకు "వెళ్ళు, ఫిరౌన్ దర్బారులో మా సందేశం వినిపించు, అతడ్ని సన్మార్గంలోకి మరల్చే ప్రయత్నం చెయ్యి." అని ఆజ్ఞాపించబడుతోంది.

"నీవు దేవుడవు కావు, దాసుడవు మాత్రమే. దాసుడుగా ఉండటంలోనే నీ శ్రేయస్సు ఇమిడి వుంది అని అతనితో చెప్పు." అని అల్లాహ్ ఆజ్ఞాపిస్తున్నాడు.

కాని ఈ విశ్వానికి అధిపతి ఎవరో, అతని శక్తి సా
ర్థ్యాలు ఎటువంటివో, ఆయన ఎంతటి ప్రజ్ఞావంతుడో మూ
(అలైహి) కు తెలుసు. అతని శక్తిముందు ఫిరౌన్ మరి
అతని బలగం ఎందుకూ కొరగానివి. అటువంటి మహి
న్వితుడైన విశ్వ ప్రభువు ఆజ్ఞాపిస్తున్నప్పుడు, అంతటి శక్తి స
న్నాని అండ తనకుండగా భయపడవలసిన పనేమిటి? కన
హజ్రత్ మూసా (అలైహి) వెంటనే సిద్ధమయ్యారు. క
ప్రార్థించడం భక్తుని లక్షణం. సహాయం కోసం విశ్వప్రభువు
అర్థించడం అతనికి శక్తిదాయకం. ఆయన తన రెండుచేతు
ఎత్తి వినమ్రులై విశ్వప్రభువు ముందు మోకరిల్లి, ప్రార్థించారు

"ఓ నా ప్రభూ! నా హృదయాన్ని విశాలపర్చు. ప్రచా
కార్యక్రమంలో ఇబ్బందుల్ని ఎదుర్కొనే శక్తిని ప్రసాదించ
నా పనిని సులభతరం గావించు, ప్రజల హృదయాలకు హ
కునేలా నా వాక్ధోరణిని తీర్చిదిద్దు"

దేవా! నన్ను వీరు అసత్యవాదునిగా భావిస్తారేమోన
నాకు భయంగా ఉంది. నావల్ల ఒక అపరాధం జరిగిపోయి
సంగతి నీకు తెలుసు. వారి మనిషి ఒకడు నా చేత చం
బడ్డాడు. వారు నన్ను చంపివేస్తే నాకు అప్పగించబడిన కార్య
పూర్తిగా నెరవేరదేమో అని విచారిస్తున్నాను.

స్వామీ! నాకు సాయపడు. మా కుటుంబంలో నుం
నా సోదరుడు హారూన్‌ను నాకు సహాయకారిగా నియమించు.
అతనివల్ల నాకు ధైర్యం కలుగుతుంది. అతడు నాకు చేదోడుగ
ఉండి, నే చెప్పే మాటలను బలపరుస్తాడు. అతడు నా కన

గొప్ప వక్తకూడా. మేమిద్దరం కలిసి ఈ కార్యభారాన్ని నిర్వహిస్తాము. నీ ఏకత్వాన్ని వీలైనంత ఎక్కువగా చాటి చెబుతాము. ఎల్లవేళలా నీ సేవలో నిమగ్నులమయి ఉంటాము.

ఆ విశ్వ ప్రభువు అభీష్టం నెరవేర్చేందుకు హజ్రత్ మూసా (అలైహి) నడుం బిగించారు. ఆయన అప్పగించిన పని పూర్తి చేయడానికి ఆయనతోనే మొరపెట్టుకున్నారు. ఇక చూడండి. ఆయన కటాక్ష వీక్షణాలు హజ్రత్ మూసా (అలైహి) పై ఏ విధంగా పడతాయో; సృష్టిలోని అణువణువు ఆయనకు తోడ్పడడానికి సిద్ధంగా ఎలా కనిపిస్తాయో చూడండి.

హజ్రత్ మూసా (అలైహి) ప్రార్థన అంగీకరించబడింది. "నీ దరఖాస్తు మంజూరు చేయబడింది. మేము నీ సోదరుడ్ని నీకు కుడిభుజంగా చేస్తాం. మీ ఇద్దరికీ విజయశ్రీ ప్రసాదిస్తాం. వారి ప్రభావం మీపై ఏ మాత్రం ఉండదు. మీరిద్దరిది, ఇంకా ఈ కార్యంలో మిమ్మల్ని అనుసరించే వారిదే పైచేయిగా ఉంటుంది" అని విశ్వ ప్రభువు సెలవిచ్చాడు కర్తవ్యదీక్షా బద్ధుడైన తన దాసునితో.

మూసా (అలైహి) నిప్పు తెస్తూ ఉంటారని ఆయన భార్య ఎదురు చూస్తోంది. ఆ వ్యవధిలో పరిస్థితులు ఎలా మారాయో ఆమెకేం తెలుసు ? అప్పటివరకూ మేకలు మేపుతూ ఉన్న మూసా (అలైహి) కు ఒక్కసారిగా, మానవాళి కంతటి సన్మార్గం చూపించవలసిన బాధ్యత ఇవ్వబడింది. స ఏమయితేనేం మూసా (అలైహి) 'తూర్' కొండనుండి తిరిగివచ్చి ఈజిప్టు వైపుగా పయనమయ్యారు సపత్నీ సమేతంగా, అదిలో సోదరుడ్ని, అప్పుల్ని కలుసుకోవాలనే కోరిక ఉండనే ఉంది.

ద్దకు వెళ్ళి వారేమి చెప్పారో తెలుసుకోవడానికి ఇది చాలు. ద్దరూ దైవప్రవక్తలు అందచేసే సందేశమే ఫిరౌన్‌కు అంద సి ఉండవచ్చు". ఇంకా తూర్ పర్వతంపై మూసా (అలైహి)కు వివరంగా సూచించబడింది ఈ విషయమే. కాని హజ్రత్ మూసా (అస్సలాం) కేవలం ఫిరౌన్ మరియు అతని జాతికోసమే ంపబడలేదు. బనీ ఇస్రాయీల్ వారిని (మూసా అస్సలాం జాతివారు) సంస్కరించడం కూడా ఆయన పనే. వీరిలో ఏర్ప డిన ధార్మిక బలహీనతను దూరం చేయవలసిన అవసరం కూడ ఉంది. బనీ ఇస్రాయీల్ వారు ఎంతోకాలంగా ఫిరౌన్ బాని సత్వంలో మగ్గుతూ ఉన్నవారు గనుక బానిస జాతుల ధార్మికత ఏంటుపడుతూ రావడం సహజమే కదా! ఎన్నో ధార్మిక విధులు వారు నిర్వర్తించలేక పోయేవారు.

ఇస్రాయీల్ వంశంలో 'ఖుర్బానీ' ఇవ్వడం ముఖ్యమైన ఆరాధనగా ఉండేది. కాని ఫిరౌన్ వారిని ఆ ఆరాధనకు దూరంగా ఉంచాడు. ఈజిప్టు వారుకూడా ఇతర ముష్రిక్ (బహు దైవారాధకులు)ల వలెనే ఆవును పూజించేవారు. అందు చేత ఇస్రాయీల్ వంశీయులకు ఆవును ఖుర్బానీ ఇచ్చే అను మతి లభించలేదు. నువ్వు నీ జాతి వారిని మూఢ విశ్వాసాల నుండి. అంధకారం నుండి వెలికితీసి ఇస్లాం వాస్తవికత వెలుగు లోకి తెమ్మని మూసా (అస్సలాం), హారూన్ (అస్సలాం) లకు సూచించిన అల్లాహ్ ఫిరౌన్‌ను దైవ ధర్మం వైపు ఆహ్వానించ డంతో పాటు బనీ ఇస్రాయీల్‌కు వారి ధార్మిక విధులు నిర్వ

త్రించుకోడానికి, ముఖ్యంగా పండుగరోజు వారు సామూహికం 'ఖుర్బానీ' ఇచ్చేందుకు అనుమతి ఇవ్వమని, ఫిరౌన్‌ను కోరమ కూడా సూచించాడు. ఇంకా, ఈ పనికి ఈజిప్టు సరయిన స్థల కాదు గనక, ఇస్రాయీల్ వంశీయులు పండుగ జరుపుకునేందుకు వారిని నగరం వెలుపలకు వెళ్ళనివ్వమని, వారి మార్గంలో అ రోధాలు కల్పించవద్దని డిమాండు చేయి అని కూడా అల్లా మూసా (అస్సలాం)కు సూచించాడు. ఇస్రాయీల్ వంశీయుల ఫిరౌన్‌కు, ఫిరౌన్ జాతికి సేవకులన్న విషయం విదితమే.

వారు కొన్నాళ్ళపాటు ఎటయినాపోతే ఫిరౌన్ జాతికి సే చేయటానికి చాకిరీ చేసే కూలీలు దొరకరు. కనుక ఫిరౌన్ జా వారు వారిని నగరం బయటకు వెళ్ళనివ్వరు. మూసా(అస్సలాం ఫిరౌన్‌కు చేసిన అభ్యర్థన "తౌరాత్"లో ప్రస్తావించబడింది:

"తరువాత మోషే అహరోనులు వచ్చి ఫరోను చూచి ఇస్రాయీలీయుల దేవుడయిన యెహోవా– అరణ్యములో నా ఉత్సవము చేయుటకు నా జనమును పోనిమ్మని ఆజ్ఞాపించ చున్నాడనిరి. ఫరో–నేను అతని మాట విని ఇస్రాయీలీయులన పోనిచ్చుటకు యెహోవా ఎవడు? నేను యెహోవాను ఎరుగన ఇస్రాయీలీయులను పోనీయననెను, అప్పుడు వారు– హెబ్రీ యుల దేవుడు మమ్ములను ఎదుర్కొనెను, సెలవయిన యెడ మేము అరణ్యములోనికి మూడు దినముల ప్రయాణమం దూరముపోయి మా దేవుడయిన యెహోవాకు బ అర్పించుదుము".

(నిర్గమ కాండము (5) 1-3)

దైవ ప్రవక్తలు ఏ సందేశమైతే ఇస్తారో ఆ సందేశం ఫిరౌన్‌కు వినిపించి, దానితోపాటు "బనీ ఇస్రాయీల్‌ని మా వెంట వెళ్ళనివ్వు, వారికి కష్టాలు కలుగజేయకు. మేము నీ దగ్గరకు నీ ప్రభువుయొక్క నిదర్శనాలు తీసుకు వచ్చాము. దైవం పంపిన సందేశాన్ని ఎవరయితే ఆచరిస్తారో వారికే శ్రేయం కలుగుతుందని తెలుసుకో" అని తెలియజేయడానికే అల్లాహ్ వారిద్దరినీ పంపాడు.

హజ్రత్ మూసా (అస్సలాం) మరియు హారూన్(అస్సలాం) ఈ కార్యం కొరకే పంపబడ్డారు. వారిపై మోపబడిన బాధ్యతలు సంక్షిప్తంగా ఇవి:

- ఫిరాన్‌కు, అతని జాతి వారికి, ఫిరౌన్ దర్బారులో మార్గభ్రష్టులయిన సర్దారులకు మొట్టమొదట దేవుని ఏకత్వం, ప్రవక్తల దౌత్యం, పరలోకం గురించి వినిపించాలి. వారిని సన్మార్గం వైపుకు రప్పించే ప్రయత్నం చేయాలి.

- ఇస్రాయీల్ వంశీయులపై జులుం చేయవద్దని ఫిరౌన్‌ను కోరాలి. ఇంకా, వారు సామూహికంగా పండుగ జరుపుకునేందుకు, ఖుర్బానీ వంటి ముఖ్యమయిన ధార్మిక విధిని నెరవేర్చుకునేందుకు తమ వెంట ఈజిప్టునుండి వెళ్ళనివ్వమని కోరాలి.

- బనీ ఇస్రాయీల్ వారిలో చోటు చేసుకున్న విశ్వాస పరమైన దోషాలు, ఆచరణారాహిత్యమనే అంధకారం నుండి వెలికి తీసి ఇస్లామీయ మౌలిక విశ్వాసాల వెలుగులోకి తీసుకు రావాలి.

రాబోయే పుటలలో మూసా (అస్సలాం) నిర్వర్తించిన ధార్మిక సేవా కార్యక్రమం వివరాలు వస్తాయి. అందులో దైవ ప్రవక్తల ప్రబోధనలకనుగుణంగా ఆచరిస్తూ, దైవధర్మంపై స్థిరంగా ఉంటూ ఆ ధర్మ సందేశ ప్రచారం బాధ్యతను నెరవేర్చ డానికి సిద్ధపడిన వారికందరికి గొప్ప పాఠం ఉంది.

## దివ్య ఖుర్ఆన్‌లో మూసా అస్సలాం ప్రసక్తి

ఇక్కడ ఒక విషయం గుర్తుంచుకోవాలి: హజ్రత్ మూసా (అస్సలాం) గురించి మనకు ఇతర గ్రంథాలకంటే దివ్యఖుర్ఆన్ గ్రంథం ద్వారానే విశ్వసనీయమయిన సంఘటనలు, వివరాలు తెలుస్తాయి. పవిత్ర ఖుర్ఆన్ మిగతా గ్రంథాల వంటి గ్రంథం కాదు. సాధారణంగా ప్రతి గ్రంథంలో ఏదో ఒక అంశంపై వివిధ సంఘటనలు, వివరాలన్నీ ఒకచోట పొందుపరచబడి ఉంటాయి. విషయాన్ని బట్టి వేర్వేరు కాండములు నిర్ణయింప బడతాయి. కాని ఖుర్ఆన్ శైలి వీటన్నింటికీ విభిన్నమయింది. పవిత్ర ఖుర్ఆన్‌లో విశ్వాసపరమయిన సమస్యలు, నైతిక బోధలు, షరీఅత్ ఆజ్ఞలు, ఇస్లామీయ సందేశం, హితబోధలు, విమర్శలు, ఖండనలు, మంచీ చెడుల పర్యవసానాల వివరాలు, దుష్ఫలితాల ద్వారా (మానవాళికి) భయపెట్టడం, సత్కార్యా లకు లభించే మంచి ప్రతిఫలం ప్రసక్తి తీసుకురావటం, దేవుని ఏకత్వం. పరలోకం, దైవ దౌత్యానికి ఆధారాలు, గుణపాఠం,

మేల్కొలుపు మొదలగు వాటికోసం పదే పదే చారిత్రక సంఘట నలు ప్రవచించబడ్డాయి. ప్రతిసారి అదే విషయాన్ని కొత్త పంథాలో వివరించడం జరిగింది. అలా వివరించడం వల్ల శ్రోతలపై వినూత్న ప్రభావం పడుతుంది. దివ్య ఖుర్ఆన్ యొక్క ఈ బోధనా తీరువల్ల ఏయే ప్రయోజనాలున్నాయో వివ రించడం ఇక్కడ సాధ్యంకాదు. అయితే ఖుర్ఆన్ గాథల విషయంలో ఒక విషయం బాగా గుర్తుంచుకోవాలి. అదేమంటే ఖుర్ఆన్‌లో ఏ సంఘటన కూడా కథగా చెప్పుకోవడం కోసం ఉదహరింపబడలేదు.

ఖుర్ఆన్ ఒక సందేశ గ్రంథం. అరబ్ దేశంలో మహా ప్రవక్త (సల్లల్లాహు అలైహివసల్లం) ప్రజలకు ఇస్లాం వైపుకు పిలిచిన కాలంలో ఆయన (సఅసం), ఆయన అనుయాయులు ఈ ఉద్యమం యొక్క వివిధ దశల్లో వివిధ రకాల పరిస్థితులను ఎదుర్కోవలసి వచ్చింది. ఆ పరిస్థితులను ఎదుర్కోవడం అంత తేలిక విషయంకాదు! దానికోసం భారీ ఎత్తున సన్నా హాలు చేయడం అవసరం. ఆ సన్నాహాలకు గొప్ప ఆధారం పవిత్ర ఖుర్ఆన్. అల్లాహ్ వివిధ సందర్భాలలో సత్యధర పక్షంలో ఉన్నవారికి అవసరమయిన సూచనలు ఇచ్చాడు, వార దైవ మార్గంలో స్థిరంగా ఉండేందుకు పూర్వపు జాతుల గాథలను వారి ముందుంచాడు. ధర్మాధర్మాల మధ్య సంఘర్షణ ఎప్పుడూ ఒకే విధంగా ఉంటుందనే విషయాన్ని వారి హృదయాలలో నాటుకునేలా చేశాడు. అంతేకాదు, ప్రతి కాలంలో కూడా ఇస్లామీయ ఉద్యమ ధ్వజవాహకులు ఒకే తరహా (క్లిష్ట) పరి స్థితుల్ని ఎదుర్కోవలసి వస్తుంది. అయితే వారు తమ సత్యా

మయిన సన్మార్గంపై గనక స్థిరంగా నిలిచినట్లయితే
అధర్మం రంగంనుండి నిష్క్రమించవలసి వచ్చింద
పాటు ఎవరికయితే సందేశపరిచయం చేయటం జరు
వారి ముందు హజ్రత్ ముహమ్మద్ (సఅసం) అందజే
మీయ సందేశం కనీవిని ఎరుగనిదేమీ కాదని, ఈ
ముందు ఉంచబడుతున్న సందేశమే ప్రతికాలంలోన
ప్రవక్త ప్రచారం చేశాడన్న సత్యాన్ని వారికి గుర్తు
జరిగింది. ఇంకా, ఈ సందేశాన్ని వ్యతిరేకించే వారిని
వారి వ్యతిరేకత స్వభావం ఎటువంటిదో, ఏ పునాదుల
ఇస్లామీయ ఉద్యమాన్ని వ్యతిరేకించే వారో విడమ
బడింది.

ఇస్లామీయ ఉద్యమాన్ని వ్యతిరేకించిన వారు, వ
లంబించిన (తిరస్కార)వైఖరి అసలెలాంటిదో, దాని ప
ఎలా రూపు దాల్చనున్నదో తెలియజేసే ఉద్దేశ్యంతోనే
యాలన్నీ పొందుపరచబడుతున్నాయి. ఈ వివరాల
ఒకవైపు విశ్వాసుల హృదయాలకు ఊరట కలుగుతుంది
సులు ఖేదపడరాదని, తమను వ్యతిరేకించేవారు కడకు
వైపు రాకపోతే, పూర్వం తిరస్కారులకు పట్టిన గతే వీ
తుందని ధైర్యం చెప్పబడింది. ఇంకోవైపు ఈ వివరాల
తిరస్కారులకు చక్కని గుణపాఠం కూడా ఉంది, భవిష
వారికేగతి పట్టనున్నదో చెప్పబడింది.

ఖుర్ఆన్ సంఘటనలు వివరించడంలో గల ఆశ
నెరవేర్చడానికి, పవిత్రఖుర్ఆన్‌లో హజ్రత్ మూసా (అస
గాథ సవివరంగా, అనేకచోట్ల ఉటంకించటం జరిగింది.

మూసా (అస్సలాం) కాలం సమీప కాలమే కాబట్టి ఆయన గురించి ప్రజలకు చాలా విషయాలు తెలుసు. ఆయన అందించిన దైవ సందేశం ఏయే దశలను, అవరోధాలను దాటుతూ పోవలసి వచ్చిందో కూడా చాలా మంది ప్రజలకు తెలుసు. అందుకనే ఖురైషీయుల ముందు ఇస్లామీయ సందేశం వినిపించేటప్పుడు పదే పదే విభిన్న రీతుల్లో మూసా (అస్సలాం) సందేశాన్ని వ్యతిరేకించే వారికి పట్టిన దురవస్థను గూర్చి ప్రస్తావించటం జరిగింది. ప్రతి సందర్భంలో ఎంతో ప్రభావ పూరితంగా వివరించబడింది. నాటి ఫిరౌన్ మాదిరిగా ఇస్లామీయ ఉద్యమ కార్యకర్తలపై దౌర్జన్యం చేస్తూ, వారిని మక్కా నుండి తరిమివేయాలని కంకణం కట్టుకున్న ఖురైషీలు ఒక యదార్థాన్ని గ్రహించాలి— దైవాదేశాన్ని ధిక్కరించి, ప్రవక్త మాటలను పెడచెవిన పెట్టినందుకు ఈజిప్టు పాలకుడు ఫిరౌన్, అతని అనుయాయులు సర్వనాశనమయిపోయారన్న విషయం తమకు (ఖురైషీలకు) తెలిసిందే. అంత తెలిసినప్పటికీ తాము మళ్ళీ ఆ మార్గాన్నే అనుసరించి అదే పరిణామాన్ని ఎందుకు చవిచూడాలి? అన్న విషయాన్ని వారు బాగా అర్థం చేసుకోవాలి. ఇటు విశ్వాసులకు హజ్రత్ మూసా (అస్సలాం), హజ్రత్ హారూన్ (అస్సలాం)ల వైఖరి వివరిస్తూ వారు సత్యధర్మ మార్గంలో నిలకడగా ఉంటే, సత్కార్యాలు చేస్తే వారికూడా దైవకటాక్షం, పరలోక విజయం, ఇహలోకంలో గౌరవ మర్యాదలు హజ్రత్ మూసా, హజ్రత్ హారూన్ (అస్సలాం) లకు మాదిరిగానే ప్రాప్తమవుతాయని బోధించబడింది.

పవిత్ర ఖుర్ఆన్‌లో మూసా (అస్సలాం) ప్రసక్తి వ సందర్భాల్ని గమనించండి. అంతకుముందు మరియు వ

చెప్పబడిన విషయాల్నికూడా పరిశీలిస్తే, మూసా (అస్సలాం జీవితంలోని ఇదే సంఘటన, ఒక ప్రత్యేక ఫక్కీలో ఎందుక వివరించబడిందో అర్థం చేసుకోవటం అంతకష్టమేమీ కాదు పవిత్ర ఖుర్ఆన్‌లోని అంశాల్లోగల ఈ ప్రత్యేకత, వైవిధ్యం కా ణంగా మూసా (అస్సలాం) ఫిరౌన్‌కు దైవ సందేశం అందిం నప్పుడు ఎదురయిన సంఘటనలు మనకు ఒక వరుస క్రమంలో లభించవు. అయితే ఈ విషయంలో ఖుర్ఆన్‌లో చెప్పబడి దాన్నంతటినీ ముందుంచుకుంటే హజ్రత్ మూసా (అస్సలాం), హజ్రత్ హారూన్ (అస్సలాం) అనుయాయులకు ఎదురయి పరిస్థితుల సమగ్ర స్వరూపం అగుపిస్తుంది.

హజ్రత్ మూసా (అస్సలాం) ఈజిప్టు చేరుకున్నారు. సోద రుడు హారూన్ (అస్సలాం)ను వెంట బెట్టుకొని దైవం తనపై మోపిన సందేశ కార్యక్రమం ప్రారంభించారు ఈ కార్యసాధనకై ఆయన (అస్సలాం)ఫిరౌన్‌దర్బారుకు కూడా వెళ్ళారు. ఫిరౌన్ మంత్రులతో, అధికారులతో సంభాషించారు. ఫిరౌన్ జాతికి చెందిన సామాన్య ప్రజలకుదైవ సందేశమిచ్చారు. తమ జాతి వారయిన–బనీ ఇస్రాయీల్ వారికూ్కడా వారు మరచిపోయిన పాఠం గుర్తు చేశారు వారిలో నిజమయిన ధార్మికత జనింపజేసే ప్రయత్నం చేశారు. ఆయన (అస్సలాం) వినిపించిన సందేశం, దైవ ప్రవక్తల సందేశమే. ఆయన ప్రతిసారీ ఎంతో ఉత్తమ రీతిలో ఇచ్చిన సందేశాలు ఇవి:

● అల్లాహ్ ఒక్కడే. ఆయన తప్ప మరో దేవుడు లేడు. విధేయతకు అర్హుడు ఆయనే. ఆరాధన ఆయనకే చేయాలి. అన్ని రకాల శక్తిసామర్థ్యాలకు అసలు యజమాని ఆయనే. అందు చేత ఆయనకు తప్ప మరొకరి సహాయం కోరటంగానీ ఇంకొకరి

రక్షణ (ఆశ్రయం) కోరటంగానీ చేయరాదు.

● **అల్లాహ్**కు విధేయత చూపడానికి **మీరేం** చేయాలి ? ఏం చేయకూడదు ? **అనే** విషయం **అల్లాహ్** నాకు చూపి మీ వద్దకు పంపాడు. కాబట్టి మీరంతా ఆయన ప్రీతి పొందాలంటే మీరు నేను చెప్పినట్లు వినాలి.

● నా మాట విన్నవారు ప్రయోజనం పొందుతారు—ఇహ లోకంలోనూ పరలోకంలోనూ. నా సందేశాన్ని పెడచెవిన పెట్టినవారు నష్టపోతారు. **మీ అసలయిన** లాభనష్టాలు **మీరు** తిరిగి బ్రతికింపబడి, **మీ అసలు** ప్రభువు సమక్షంలో హాజరు కాబడినప్పుడు తెలిసివస్తాయి. ఆ రోజు (ఖియామత్) రావడం తథ్యం. ఆనాటి విజయమే అసలు విజయం.

ఫిరౌన్ ఎదుట **హజ్రత్** మూసా (అస్సలాం) దైవసందేశం వినిపించటంతోపాటు మరో కోరికకూడా కోరారు. ఆదేమంటే అవమానకరమయిన బానిసత్వంలో చిక్కుకున్న బనీఇస్రాయీల్‌కు విముక్తి కలిగించాలి, వారికి దైవం తరఫున ఆజ్ఞాపించబడినట్లుగా వారు దైవాన్ని ఆరాధించడానికి స్వేచ్ఛ, అవకాశం ఇవ్వాలి. ముఖ్యంగా అల్లాహ్ కొరకు "ఖుర్బానీ" చేసే స్వాతంత్ర్యం ఇవ్వాలి. "ఇందుకోసం ఇస్రాయీల్ వంశీయులను నా వెంట వెళ్ళనిస్తే నేను వారిని దూరంగా ఎక్కడికన్నా తీసుకు వెళ్ళి అక్కడ సామూహికంగా దైవప్రీతి కోసం ఖుర్బానీ చేయగలను." అని **మూసా** (అస్సలాం) కోరారు. దానికి ఫిరౌన్ ఏమన్నాడు ?



# ఫిరౌన్ దర్బారులో దైవ సందేశం

ఫిరౌన్‌పై హజ్రత్ మూసా (అస్సలాం) సందేశం ఎటు వంటి ప్రభావం వేసిందో మీరు సులభంగా అంచనా వేయ గలరు.

"నువ్వు సామాన్య మానవులకంటే గొప్ప వ్యక్తివి, అన్నిటి కంటే పెద్దదేవతకు అవతార పురుషుడివి, సూర్యవంశస్థుడవు, నీ ముందు లక్షలాది ప్రజలు తలవంచుతారు. దేశంలో కెల్లా శక్తిశాలివి, నీ కోరికయే చట్టం, నీ సంజ్ఞతో దేశమంతా నాట్యం చేస్తుంది" అని ఫిరౌన్ దర్బారీలు అతని బుర్రలో బాగా నాటు కునేట్లు చేశారు. అలాంటి వ్యక్తి ఫిర్‌ఔన్ ఎదుట కేవలం ఇద్దరంటే ఇద్దరు వచ్చి నిలబడ్డారు. వారు సిరిసంపదలు గాని, అధికారం గాని లేనివాళ్ళు. తమతోపాటు తమ జాతికి చెందిన జనసమూహం ఏమీలేనివాళ్ళు. దేశంలో అందరికన్నా ఎక్కువ బాధించబడిన వాళ్ళు. తమ బంధువర్గంచే వెట్టిచాకిరి చేయబడు తున్న వాళ్ళు. ఫిర్‌ఔన్ జాతివారికి బానిసలయిన ఆ ఇద్దరూ

దర్బారులో వచ్చి ఫిరౌన్‌తో ఇలా అన్నారు.

"నీవుకూడా సామాన్య మానవుల్లాంటి ఒక మానవుడవు. దేవుడవుకాదు. దేవుని దాసుడవు మాత్రమే. ఆయనే నిన్ను సృష్టించాడు. ఆయన కటాక్షంతోనే జీవించి ఉన్నావు. ఆయన ఇచ్చిందే తిని బ్రతుకుతున్నావు. నీ యీ సిరిసంపదలు, అధికారం, పేరు ప్రతిష్టలు అన్నీ కొన్నాళ్ళ వరకే; ఇతర మానవుల లాగే నువ్వుకూడా మరణించవలసి ఉంది. మరణానంతరం నీ కర్మల ఫలితం అనుభవించాల్సి వుంది. (దేవునికి) దాసుడవయి ఉండటంలోనే నీకు లాభముంది, తిరుగుబాటు ధోరణికి దూరంగా ఉండు ఈ విశ్వంయొక్క నిజప్రభువును ధిక్కరించకు. నిజప్రభువు మనందరికీ చూపిన మార్గాన్నే నువ్వూ అనుసరించు. ఆ సన్మార్గాన్ని చూపడానికే మేము నీ దగ్గరకు పంపబడ్డాము."

వారు ఇంకా ఇలా అన్నారు: "ఏజాతి నయితే నువ్వూ నీ జాతివారు కట్టు బానిసలుగా చేసుకున్నారో, వారుకూడ మానవులే. వారితో మానవులవలె ప్రవర్తించాలి. ఇంకా, వారికి అజ్ఞాపించబడినట్లుగా వారు తమ ప్రభువును ఆరాధించుకునే అవకాశం వారికి కలుగజేయాలి. వారిని మా వెంట పంపాలి."

హజ్రత్ మూసా (అలైహి) ఆయన సోదరుడు హజ్రత్ హారూన్ (అలైహి) ఫిరౌన్ ఆస్థానంలోకి వెళ్ళిన మొదటి రోజు ఇన్నిమాటలు బహుశా అనేసి ఉండరు. ఆ సోదరులిద్దరు దైవం ప్రసాదించిన బుద్ధీ జ్ఞానాలను ఉపయోగిస్తూ, దైవాజ్ఞ ప్రకారం నడుచుకుంటూ ఈ సందేశాన్ని సమయం, సందర్భాన్ని బట్టి యుక్తిగా ఫిరౌన్‌కు వినిపించి ఉంటారు. అయితే మొత్తానికి దైవసందేశమంతా ఫిరౌన్‌కు తెలుపబడింది.

వారు చెప్పవలసినదంతా ఫిరౌన్‌కు మాత్రమే చెప్పేసి, ఆ ఫిరౌన్ సింహాసనం తల్లక్రిందులవుతుందని మౌనమే పాల్ లెక్కించుకుంటూ కూర్చోలేదు. దైవ సందేశాన్ని వారు దే ప్రజలందరికీ వినిపించారు. ఆరాధనకు, విధేయతకు అర్హుడ ఫిరౌన్ కాదనీ, తన ఉనికిలో, గుణగణాల్లో ఒక్కడే అయిన అల్లాహ్ మాత్రమే అర్హుడని ప్రజలకు ఉద్బోధించారు.

మొదట ఫిరౌన్ వారి మాటలను పట్టించుకోలేదు. తర్వాత నయానో భయానో వారి నోరు కట్టించాలని చూశాడు. ఒకసారి ఇలా అన్నాడు: "నువ్వు మా కుటుంబంలో పోషింపబడిన వాడవు. సంవత్సరాల తరబడి మా ఇంట పెరిగావు, పైగా నువ్వు ఒక మనిషిని చంపి ఇక్కడ్నుంచి పారిపోయావు. మేము నిన్ను ఏమీ అననందుకు మాకు కృతజ్ఞత చెల్లించవలసింది పోయి మాకే మార్గం చూపడానికి సిద్ధపడ్డావా? నీ యీ వైఖరి ఏమీ బాగాలేదు. ఇకనైనా జాగ్రత్తగా ఉండు."

హజ్రత్ మూసా (అలైహి) అన్నారు: "నావల్ల అజ్ఞానంలో ఒక తప్పు జరిగినమాట వాస్తవమే. నేను మీకు భయపడి ఇక్కడ్నుంచి పారిపోయిన సంగతికూడా నిజమే. కాని అల్లాహ్ నా తప్పును క్షమించాడు. నాకు హితోపదేశం చేశాడు. నన్ను తన ప్రవక్తగా నియమించాడు. ఇక అనాడు నీవు నన్ను పోషించిన దానికి కృతజ్ఞత అంటావా, కాస్త ఆలోచించు— నీవు ఇస్రాయీల్ వంశీయులతో ఎలా ప్రవర్తించావో! ఒక వ్యక్తితో మంచిగా వ్యవహరించి, యావజ్జాతిని జీవితాంతం వెట్టిచాకిరీలోకి ఈడ్చటం, ఉత్తమ ప్రవర్తనకు నిదర్శనమనుకుంటున్నావా?"

తన దగ్గరకు వచ్చి ప్రతిఒక్కరూ తనకు వంగి వంగి సలాములు చేసినట్లే హజ్రత్ మూసా (అస్సలాం) కూడ తనకు వంగి సలాము చేస్తాడని ఫిరౌన్ భావించాడు. మూసా (అస్సలాం) నోటి వెంట కృతజ్ఞతా వాక్యాలు వెలువడతాయేమో, నీవే దిక్కని అతడు తనను బ్రతిమాలుతాడేమో, ప్రాణభిక్ష పెట్టినందుకు చేతులు జోడించి కృతజ్ఞత చెల్లిస్తాడేమో, భవిష్యత్తులో తన దయాదాక్షిణ్యాల కోసం దరఖాస్తు చేస్తాడేమో విందామని ఫిరౌన్ చెవులు ఎదురు చూశాయి. కాని అతనాశించిన దానికి ఫిరౌన్ ఎదుట వారు ఈనాటి వరకు ఎవరూ పలకని పలుకులు నిండు దర్బారులో పలుకగానే దర్బారు వారి ఎదుటే వారిద్దరిని అవమానించాలనే ఉద్దేశ్యంతో ఫిరౌన్ ఉగ్రుడై అడిగాడు, "సరే, నిన్ను ఈ విశ్వప్రభువు పంపాడంటున్నావు, అతనితో నీకేమిటి సంబంధం? ఆ విశ్వప్రభువు ఎవరు" హజ్రత్ మూసా జవాబిచ్చారు, "ఎవరయితే భూమ్యాకాశాలకు ప్రభువో, ఇంకా భూమ్యాకాశాల మధ్యనున్న దాని కంతటికీ యజమానో ఆయనే నా నిజప్రభువు. ఆయనే ఈ సమస్తాన్ని సృజించాడు. ఆయనే అందరికీ మార్గదర్శకుడు."

ఇది విన్న ఫిరౌన్ ఏం జవాబిస్తాడు? తానేమో తన దర్బారు వారితో, "నేనే మీకందరికీ పెద్దదైవాన్ని" అని అన్నాడు కదా! ఇప్పుడేమో నిండు దర్బారులో మరొక వ్యక్తి నిలబడి, నిజదైవం ఒకడున్నాడు, ఈ సృష్టికి కర్త, యజమాని ఆయనే, ఆయనే ఈ సృష్టిని పర్యవేక్షిస్తున్నాడు అని అంటున్నాడాయె. ఫిరౌన్‌కు తన దర్బారీల సంతృప్తికోసం ఏదో ఒకటి చేయాలి. "అసలు ప్రభువును నేనే, మరొకరెవరూ లేర"ని రుజువు చేయాలి.

# ఫిరౌన్ దర్బారులో దేవుని నిదర్శనం

ఫిరౌన్ ఈసారి మళ్ళీ ప్లేటు ఫిరాయించాడు, "సరే, ఇప్పటివరకు చనిపోయిన వారిగతి ఏమిటి?" అని అడిగాడు అలా అడగటంలో ఎంతో కాపట్యం ఉన్నది. "వారంతా మార్గ భ్రష్టులే" అని మూసా (అస్సలాం) జవాబిస్తారని ఫిరౌన్ నమ్మాడు. ఒకవేళ మూసా (అస్సలాం) ఆ విధంగా జవాబిచ్చారంటే దర్బారులోని వారంతా ఉగ్రులై ఒక్కసారిగా ఆయనమీద విరుచుకు పడతారు. వారి పూర్వీకుల్ని మార్గ భ్రష్టులంటే వారెలా సహిస్తారు? కాని ప్రవక్తలు ఇటువంటి వాదాలలో తలదూర్చరు. వారు సవ్యమైన, సత్యమైన మాటల్నే పలుకుతారు. మూసా (అస్సలాం), "నా ప్రభువు వారిని గురించి బాగా ఎరుగు. ఏ విషయమూ ఆయన దృష్టినుండి వైదొలగడం కాని, ఆయన మర్చిపోవడంగానీ జరగదు. ఆ ప్రభువే మీ కోసం ఈ భూమిని పాన్పుగా పరచాడు. అందులో మీ కోసం మార్గం సుగమం చేశాడు. ఆకాశాన్నుండి వర్షం

కురిపిస్తాడు. ఆయన అన్ని రకాల చెట్లు జంటలు పుట్టించాడు మీరూ తినండి, మీ పెంపుడు జంతువులకుకూడా తినిపించండి వీటన్నింటిలోనూ వివేక వంతులకు ఎన్నో నిదర్శనాలున్నాయి" అని అన్నారు.

ఈ ఉపన్యాసాన్ని మీరు గమనించారా ? కేవలం చని పోయిన వారితో అల్లాహ్ ఎలా వ్యవహరించాడన్న విషయాన్ని పట్టుకు వేళ్ళాడటం వల్ల ప్రయోజనం ఏమీలేదు అని మూసా (అస్సలాం) స్పష్టం చేశారు; "అల్లాహ్‌కు గల జ్ఞానం అపార మైనది. ఎవరికి ఏ విధంగా ప్రతిఫలం లభించాలో ఆయనకు బాగా తెలుసు. ఏ విషయాలైతే అల్లాహ్‌కు సంబంధించినవో వాటిలో తలదూర్చే బదులు మానవుడు తనచుట్టూ విస్తరించి ఉన్న దైవానుగ్రహాలను శ్రద్ధగా గమనించాలి. అన్ని వరాల ప్రదాత అయిన అల్లాహ్ హక్కులు తనపై ఏమున్నాయి ? తాను ఆ సృష్టికర్తయెడల ఏ విధంగా మెలగాలి ? తాను అవలంబించ వలసిన వైఖరి ఏది ? వీటన్నిటినీ గురించి మానవుడు తన బుద్ధి వివేకాలతో తెలుసుకోవాలి. ఇది వివేకవంతుల విధానం. దానికి వ్యతిరేకంగా ప్రవర్తించడం కేవలం పెంకితనమే.

ఫిరౌన్ ఈ ప్రబోధనలు వినడానికి ఎంతమాత్రం సుము ఖంగా లేడు. ఈ మాటలన్నీ విని దిగ్గున లేచాడు. "అదేం కాదు. యజమాని, ప్రభువును నేనే. మమ్మల్ని కాదని ఎవ రయినా ఇతరుల్ని పాలకునిగా అంగీకరిస్తే వారిని జైల్లో కుక్కించి కుళ్ళబెడతాను, జాగ్రత్త !" అని బెదరించాడు.

హజ్రత్ మూసా (అస్సలాం) ఈ బెదరింపులకు లొంగ లేదు. "సరే నేను చెప్పేదంతా నా తరఫున చెప్పడంలేదని,

నన్ను దేవుడే ఈ సందేశమిచ్చి పంపాడని చెబితే మీరు నమ్మటం లేదు. నే నేదైనా స్పష్టమైన నిదర్శనం చూపిస్తే అప్పుడైనా మీరు నామాటను విశ్వసిస్తారా ? అని ప్రశ్నించారు. జవాబుగా ఫిరౌన్, "సరే అదేదో చూపించు" అన్నాడు.

హజ్రత్ మూసా (అస్సలాం) తనచేతి కర్రను క్రింద పడవేశారు. చూస్తుండగానే అదొక పాముగా మారిపోయింది. తన చేతిని చంకలో పెట్టి బయటకు తీశారు. అక్కడి వాళ్ళంతా ఆ చేయి మెరిసిపోవడం చూశారు.

ఇప్పుడు ఫిరౌన్ తన దర్బారులోని వారిని తృప్తిపరచడానికి వెంటనే అన్నాడు— "వీళ్ళు వచ్చి మంత్రగాళ్ళు. తమ మాయా జాలంతో మిమ్మల్ని మీ దేశంనుండి తరిమివేయాలని చూస్తున్నారు. ఇక మీరే చెప్పండి వీళ్ళకు ఎలా బుద్ధి చెప్పాలో ?"

దర్బారు వాసులు ఆలోచించారు.

ఇతని తల తీసెయ్యడం చాలాతేలిక, కాని మూసా (అస్సలాం) నేడిక్కడ చెప్పిన మాటలే చాలాచోట్ల చెప్పి ఉన్నాడు. కొందరి మనస్సులపై ఆయన మాటల ప్రభావం పడే ఉంటుంది. ఆయన చేతికర్ర పాముగా మారిందన్న విషయం అందరికీ తెలిస్తే ప్రజల హృదయాల్లో అతని మాటల విలువ ఇంకా పెరిగి పోవచ్చు. కాబట్టి అతన్ని చంపడంతోనే ఈ ఉపద్రవం—అణగి పోదు. దీనికి మరోమందు ఏదన్నా చూడాలి.

**(4) దైవ ప్రవక్తలు IV**

ఎట్టకేలకు ఫిరౌన్ సలహాదారులు ఒక నిర్ణయానికి వచ్చారు

మహారాజా! మూసా (అస్సలాం) ను, ఆయన సోదరుని కొంత కాలంపాటు వారి స్థితిపైనే వదిలెయ్యండి. దేశంలో మాంత్రికులందరూ సమావేశం కావాలని చాటింపు వేయండి మాంత్రికులు వచ్చాకనే వీళ్ళ అంతు తేలుద్దాం. మంత్రానికి మంత్రమే విరుగుడు." అన్నారు.



# మాంత్రికులతో పోటీ

దేశ వ్యాప్తంగా రాజాజ్ఞ చాటింపు వేయబడింది. కొద్ది దినాలలోనే బాణామతి (జాదు) లో ఆరితేరిన వారంతా రాజధానికి చేరుకున్నారు.

ఫిరౌన్, మూసా (అస్సలాం)తో అన్నాడు, "ఇప్పుడు నీ మంత్రవిద్యని మంత్రాలతోటే ఎదుర్కొంటాము. ఏరోజు కావాలో కుంటావో నిర్ణయించుకో. ఆరోజు నువ్వూ, మేమూ ఒకే మైదానంలో పోటీకి తలపడదాం."

"నీ పండగరోజు ఈ పనికి తగినదిగా ఉంటుంది, ఆరోజు ప్రముఖులనందర్నీ సమావేశపరచు" అని మూసా (అస్సలాం) అన్నారు.

పోటీ జరగాల్సిన రోజు నిర్ణయమైంది. ఫిరౌన్ సన్నాహాలను ఆరంభించాడు. అటు మూసా (అస్సలాం) మరోసారి ప్రజలకు నచ్చజెప్పటానికి ప్రయత్నించారు. ఆయన మాంత్రికులకు కూడా తన సందేశం వివరించారు. దేవుని ఏకత్వం, దైవదౌత్యం, పరలోక జీవిత వాస్తవికతను విశదీకరించి ఇస్లామీయ సందేశ సారాన్ని తెలియజేసి, "చూడండి! మీరు చేస్తున్నదాంట్లో మీకు లభించేది దిక్కులేని చావు మాత్రమే. మీరు కల్పించిన షిర్క్ (బహుదైవారాధన)ను అల్లాహ్‌కు ఆపాదించకండి. ఆయన సందేశాన్ని ఈ విధంగా తిరస్కరించకండి తిరస్కరిస్తే దైవాగ్రహం మీపై విరుచుకు పడవచ్చు. అల్లాహ్‌ను ఎదిరించి తలబిరుసుతనంతో వ్యవహరించే వారు నాశనం కావడం తథ్యం." అని హెచ్చరించారు.

హజ్రత్ మూసా (అస్సలాం) ప్రబోధన విని ప్రజలు కాస్త ఆలోచనలో పడ్డారు. ఈ పరిస్థితిని గమనించిన ఫిరౌన్, అతని సర్దారులు కలవరపడ్డారు, పరస్పరం సంప్రదించుకున్నారు. చాలా సేపు తర్జన భర్జన జరిగాక హజ్రత్ మూసా (అస్సలాం)కు వ్యతిరేకంగా ప్రచారం చేసి ప్రజాభిప్రాయాన్ని తమ కనుకూలంగా మలచుకోవాలని నిర్ణయించారు. వారు ఆ ఆయుధాన్నే (అబద్ధపు ప్రచారం) ప్రయోగించారు, ఏదైతే నేటికీ ఇటువంటి పరిస్థితులలో సాధారణంగా ప్రయోగించబడుతోందో.

ఫిరౌన్ అనుచరులు దేశ ఔన్నత్యాన్ని కొనియాడారు. తమ సంస్కృతి పట్ల వారికి గల అభిమానాన్ని ప్రకటిస్తూ జనాన్ని తమ వైపుకు త్రిప్పుకోవాలని ఎత్తుగడ వేశారు, "ఈ ఇద్దరెవరో మీకు తెలుసా? ఇద్దరూ పెద్ద మాయగాళ్ళు. వీళ్ళు తమ మంత్రతంత్రాల ద్వారా మిమ్మల్ని మీ దేశం నుండి తరిమివేయాలని చూస్తున్నారు, మీకు ప్రియమైన మతాన్ని, ఉత్తమ నాగరికతని కూకటి వ్రేళ్ళతో పెకిలించి పారేయాలని కుట్ర పన్నుతున్నారు"ని దుష్ప్రచారం చేయసాగారు.

మూసా (అలైహిస్సలాం) కూడా తన సందేశ ప్రచారం ఆపలేదు. తన కర్తవ్యాన్ని నిర్వర్తిస్తూనే ఉన్నారు. ఆయన వ్యతిరేకులు మూసా (అలైహిస్సలాం), హారూన్ (అలైహిస్సలాం)లు చెప్పేదంతా అబద్ధమని సహేతుకంగా ప్రజల్లో చాటవలసింది. కాని అధర్మం ఎన్నటికీ ధర్మం ముందు నిలవజాలదు. అంచేత అధర్మ పూజారులు ఎప్పుడూ ఇటువంటి (దుష్ట) విధానాలనే అవలంబిస్తారు. సత్యధర్మ ప్రచారం చేసేవారిని గురించి, దుష్ప్రచారం చేస్తూ వారిపై నీలాపనిందలు మోపుతారు. వాళ్ళు అలాంటి వారు, ఇలాంటి వారని, వారి ప్రచారలక్ష్యం రాజ్యకాంక్షేనని, మీ నుండి అధికారం చేజిక్కించుకొని సర్వాధికారులవుతారని, మీ తాతముత్తాతల ఆచార వ్యవహారాలు అంతమైపోతాయని రకరకాలుగా హెచ్చరించేవారు ఆ అధర్మ పూజారులు

ఫిరౌన్ కావించిన ఈ ప్రాపగాండా ఫలితంగా, మూసా (అలైహిస్సలాం) వైపుకు—అంటే సత్యధర్మం వైపుకు—మరలగలిగే వారిలో కూడ స్తబ్దత ఆవరించింది. కాని మూసా (అలైహిస్సలాం) సందేశ ప్రభావం పూర్తిగా సమసిపోవాలంటే ఈ

మాత్రం ప్రభావం పోలేదు. మూసా (అలైహిస్సలాం) చూపినదంతా మంత్రప్రభావమే అయితే దేశంనిండా గొప్పగొప్ప మంత్రగాళ్ళున్నారు. ఆ రోజుల్లో మంత్రాల ప్రభావం హెచ్చుగా ఉండేది. కాబట్టి దేశానికి, జాతికి వ్యతిరేకంగా కుట్ర చేస్తున్న వారిని తగిన రీతిలో గట్టిగా ఎదుర్కోవల్సి ఉంది. అందుకోసం గొప్పగొప్ప మంత్రగాళ్ళందరూ సర్వసన్నద్ధులై రంగప్రవేశం చేశారు. ఇక ఇప్పుడు ఎవరు గెలిస్తే వాడు సర్వాధికారులు ఒకవేళ మూసా (అలైహిస్సలాం) పెద్ద పెద్ద మంత్రగాళ్ళను ఓడించినట్లయితే ఆయన మంత్రగాడు కాదు. ఆయన చెపుతున్నదంతా నిజమే అవుతుంది. అలా కాక ఒకవేళ ఆయన మంత్రగాడే అయితే ఆయన రంగంలో నిలువజాలడు పలాయనం చిత్తగించాల్సిందే.

పోటీ తీవ్రంగా ఉంది. ఫిరౌన్ అధికారం, పరువు ప్రతిష్ఠలు ఆ పోటీ ఫలితాలపై ఆధారపడి ఉన్నాయి. కాని మాంత్రికులకు ఒక ఉన్నత ఆశయం అంటూ ఏదీ ఉండదుగా! తమ క్షుద్ర విద్యను నేర్పుగా ప్రదర్శించి భుక్తిని సంపాదించుకోవటమే వారి లక్ష్యం. ఇప్పుడు వారి లక్ష్యసాధనకు భలే మంచి బేరం. కాబట్టి రేటు మాట్లాడుకొని మరీ పని మొదలు పెట్టదామని ఆ మాంత్రికులు తలంచారు. "ప్రభూ! మేం గెలిస్తే మా బహుమతి మాకు లభిస్తుంది కదా!" అనడిగారు.

"ఎందుకు లభించదు? మిమ్మల్ని మేము ఆస్థానంలో నిలయ విద్వాంసులుగా చేర్చుకుంటాం" అన్నాడు ఫిరౌన్. ఇంత పెద్ద హోదాను పొందగలమనే ఆశ మాంత్రికులకు లేకపోయినా

ఫిరౌన్ ఇచ్చిన హామీ విని వారు ఆనందంతో పొంగిపోయారు

మూసా (అలైహిస్సలాం) తో,

"చెప్పు, ముందు నీ మంత్ర శక్తి ప్రదర్శిస్తావా ? లేక మా ఎత్తుల్ని ప్రారంభించమంటావా ?" అని ప్రశ్నించారు.

"ముందు మీరే మీ ఎత్తులు ప్రారంభించండి" అన్నారు మూసా (అస్సలాం). మంత్రగాళ్ళు తమ కర్రలను, తాళ్ళను విసిరారు. "ఫిరౌన్ ఔన్నత్యం సాక్షిగా మేము తప్పక విజయం సాధిస్తాము" అని అన్నారు వారు.

వారు ప్రదర్శించిన విద్య అక్కడి వారందరినీ సంభ్రమాశ్చర్యాలలో ముంచెత్తింది.



# సత్యం వచ్చేసింది

వాళ్ళ చేతబడి ప్రభావం ఎంత ఉధృతంగా ఉందంటే, అక్కడున్న వారంతా కనికట్టు ప్రభావంలో పడిపోయారా ! అనిపించింది. తాళ్ళు, లాఠీలు పాములుగా మారి జరజరా ప్రాకుతున్నట్లు తోచింది వారికి. నలువైపులా భయానక వాతావరణం అలుముకుంది. ఈ పరిస్థితిని చూసిన మూసా (అలైహిస్సలాం)కు భయంవేసింది. ప్రజలు చేతబడి ప్రభావానికి లోనయి తన సందేశాన్ని అబద్ధమయినదిగా భావిస్తారేమో ! ఈ ఆలోచన కలిగినవెంటనే అల్లాహ్ ఆయనకు ధైర్యం కలిగించాడు. దైవాదేశం వినబడింది;

"మూసా ! ఏ మాత్రం భయపడనవసరంలేదు. ఆధిక్యత నీదే. నీ చేతిలోని కర్రను క్రింద వేయి. ఇక చూడు వాళ్ళు వేసిన ఎత్తులు ఇప్పుడే చిత్తవుతాయి. వారు చేసింది మంత్రప్రయోగమే కదా ! మంత్రాల పునాదిపై ఏ ఉద్యమమయినా నిలబడగలుగుతుందా ?"

మూసా (అలైహిస్సలాం) తన చేతికర్రను విసిరారు. అది కొండచిలువగా మారింది. అది ఎటు వెళితే అటు మంత్ర ప్రభావం క్షీణించసాగింది. మంత్రవేత్తల శ్రమ అంతా చిటికలో జారిపడ మీద వేసిన పన్నీరయిందని ప్రజలందరూ గ్రహించారు.

విచిత్రమయిన దృశ్యం అది. ఫిరౌన్, అతని సభికులు విస్మయాందోళనలతో నిల్చుండి పోయారు. అసలేం జరుగుతుందో వారికి అంతుపట్టలేదు.

ఇటు మంత్రగాళ్ళకూ ఏమీ పాలుపోలేదు. మంత్ర విద్యలో తమను ఓడించగల వారెవరూ లేరని వాళ్ళకు గట్టి నమ్మకం ఉండేది. ఇప్పుడేమో వాళ్ళ మంత్రాలు క్షణంలో పనికిమాలినవయ్యాయి. వారి కళ్ళముందు ఉరుము ఉరిమినట్లయింది. యదార్థం వారి ముందుకు వచ్చింది. వారికి మూసా (అలైహిస్సలాం) చెప్పేదంతా సత్యం అని విశ్వాసం కలిగింది. నిశ్చయంగా ఈయన దైవప్రవక్తయేనని వారు నమ్మారు.

అసలు యజమాని, ప్రభువు అల్లాహ్‌యేనని, ఫిరౌన్ కాదని మంత్రగాళ్ళు గ్రహించారు. మూసా (అలైహిస్సలాం) దైవప్రవక్త, ఆయన ఇచ్చే సందేశం నిజమయింది. ఈ ప్రాపంచిక జీవితం శాశ్వతం కాదు, దీని తర్వాత శాశ్వతంగా ఉండే మరో జీవితం రానున్నది. అసలు విజయం ఆ జీవితంలో సాధించే విజయమే- ఈ నమ్మకం, విశ్వాసం దృఢమైనాక వారి దృష్టిలో ఫిరౌన్ పట్లగల భక్తిభావం పటాపంచలైపోయింది. ఇప్పుడు ఫిరౌన్ వేసే శిక్షల భయంగాని అతని బహుమానాల పేరాశగాని వారిలో లేదు. ఎందుకంటే ఫిరౌన్ విధించే శిక్షలు

కాని, అతడిచ్చే పారితోషికాలు గాని ఐహిక జీవితంతోనే సంబంధం కలవి. అయితే వారి దృష్టిలో ఇప్పుడు, తర్వాత రాబోయే శాశ్వతమయిన పరలోక జీవనం ఉంది. అక్కడి విజయమే అసలు విజయం. ఆ విజయం అల్లాహ్‌పై విశ్వాసం ఉంచటం మరియు దైవప్రవక్తను గుర్తించడంతోనే ముడిపడి ఉంది.

ఈ విషయాలన్నీ మంత్రగాళ్ళ హృదయాల్లో ఎంత దృఢంగా నాటుకున్నాయంటే వారు ఏ విధమయిన యుక్తిని ప్రదర్శించడంగాని, తాము తీసుకునే నిర్ణయానికి ఇది సరయిన సమయం అవునా? కాదా? అనికూడా ఆలోచించలేదు. వెంటనే వారు సాష్టాంగపడి, "మేము విశ్వసిస్తున్నాము. ఇహపరాలకు ప్రభువు, యజమాని ఎవరో, ఎవరి దాస్యం అయితే మూసా (అలైహిస్సలాం), హారూన్ (అలైహి) లు చేయమని ప్రజలకు ఉద్బోధిస్తున్నారో ఆ దైవాన్ని మేము విశ్వసిస్తున్నాం" అన్నారు.

ఫిరౌన్ దీనికి ఏ మాత్రం సిద్ధం కాలేదు. మాంత్రికుల ఈ చర్యవలన వ్యవహారమంతా బెడిసికొట్టింది. మూసా (అలైహిస్సలాం) సందేశం బలహీనపడేందుకు, దాని ప్రభావం రూపుమాపేందుకు అతడీ పథకంవేశాడు. కాని అది కాస్తా లాభించే బదులు అతనిపైకే ఎదురు తిరిగింది. ఇటువంటి గొప్ప మాంత్రికులు ఫిరౌన్ సమక్షంలో ప్రాణాల్నిసయితం లెక్క చేయక, నిండు సభలో మూసా (అలైహిస్సలాం) ప్రదర్శిస్తున్నది మంత్రజాలం కాదని ప్రకటించారు. ఇక మూసా (అలైహిస్సలాం) మంత్రగాడని చెప్పి ప్రజలను ఆయన సందేశం విననీయకుండా నిరోధించడానికి ఇప్పుడు అవకాశం ఏదీ ?

ఇక్కడ ఒక విషయాన్ని ఆలోచించాలి. మూసా (అలైహిస్సలాం) సందేశం ఎదుటే ఉన్నది. ఫిరౌన్‌కు, అతని భజన పరులకు మూసా (అలైహిస్సలాం) అనేక విధాలుగా హితోపదేశం చేసే ప్రయత్నం చేస్తూనే వచ్చారు. కొంతకాలంగా ఈ ప్రయత్నం నిరంతరాయంగా కొనసాగుతూనే ఉంది. ఫిరౌన్ మాత్రం తన స్థానం నుంచి కదలలేదు. అతని భట్రాజులు కూడా సన్మార్గానికి మళ్ళలేదు కాని మంత్రగాళ్ళను చూడండి, మూసా (అలైహిస్సలాం) ఇచ్చిన దైవసందేశం వారి చెవిన పడగానే వారు దాన్ని అర్థం చేసుకున్నారు. మూసా (అలైహిస్సలాం) ప్రదర్శించిన అద్భుత మహిమల్ని చూసినతర్వాత ఇది జాలవిద్య, మంత్రతంత్రాల విద్య కానేకాదన్న విశ్వాసంకూడా వారిలో కలిగింది. ఆ తర్వాత వారు ఒక్క నిముషంకూడా వేచి చూడక అప్పటికప్పుడే నిండుసభలో అల్లాహ్‌కు, ఆయన ప్రవక్తపట్ల తమ విశ్వాసాన్ని ప్రకటించారు. జన సమూహం నిష్క్రమించిన తర్వాత మూసా (అలైహిస్సలాం) సమక్షంలో విశ్వసించుదాంలే అనికూడా వారు ఆగలేదు.

ఈ రెండు స్వరూపాలూ మనముందున్నాయి. వీటిని పరిశీలించండి. ప్రబోధనా మార్గాన్ని నిరోధించే వాటిలో అన్నింటికన్నా పెద్ద అడ్డంకులు ధనం, అధికారమదం మాత్రమే అని సులభంగా అర్థమవుతుంది. మనిషి ఏదోరకంగా అధికారంలోకివస్తాడు. పరిపాలనాధికారాలు పొందిన తర్వాత దైవదాసులకే దైవమై కూర్చుంటాడు. అటువంటి పరిస్థితులలో అతడు తన పీఠం దిగి, దైవదాసులకు దైవం అయ్యేబదులుగా దైవానికి దాసుడుగా మారడం అంటే అతనికి సహించరాని

విషయమైపోతుంది. మానవులలో ఈ "దైవత్వం" ఒకసారి రాచరికపు రంగుల్లోనూ, మరొకప్పుడు జాతి నాయకుని వేషం లోను, ఇంకొకప్పుడు మతాధికారి రూపంలోను వచ్చేస్తుంటుంది.



# అనుకున్నదొకటి జరిగింది మరొకటి

పరిస్థితిని గమనించిన ఫిరౌన్ వెంటనే ప్లేటు మార్చేశాడు.

"ఏమిటీ ? మీరంతా నా అనుమతి లేకుండానే విశ్వాస ప్రకటన చేసేస్తారా ? ఇప్పుడు తెలిసింది మీ అసలు సంగతి. మూసా మీ అందరి గురువు అన్నమాట! మీరంతా కలసి ప్రభుత్వానికి వ్యతిరేకంగా పెద్ద కుట్రపన్నారు. ఈ దేశస్థుల్ని తరిమి వేయాలని, ఇక్కడి ప్రభువులవ్వాలని అనుకుంటున్నారా మీరు? అయితే వినండి ! మీ ఈ కుట్రవిజయవంతం కాజాలదు. మీకే గతి పట్టనున్నదో మీకు ఇప్పుడే తెలుస్తుంది—మీ కాళ్ళు చేతులు

నరికి మిమ్మల్ని ఉరికంబం ఎక్కిస్తాను. అప్పుడు మీకు తెలి వస్తుంది, కఠిన శిక్ష విధించేది ఎవరో-" అని రంకెలు వేశాడు.

ఫిరౌన్ ఉగ్రరూపం చూసి ఎంతమంది గడగడ లాడి పోయారో తెలీదు. ఈనాటికీ మనం చూస్తుంటాం, తన అధి కారాసనానికి ముప్పువాటిల్లినప్పుడు, ఒక మనిషి మరో మనిషికి తాను ఇవ్వగలిగినంత కఠినాతి కఠినమైన శిక్ష ఇవ్వడం సమంజ సమే కాక అత్యవసరం అనికూడా భావించబడుతోంది- ఈ అధి కారం స్వయంగా ప్రజలే ఇచ్చినా, దానిపై ప్రజాస్వామ్యం, ప్రజాభీష్టం వంటి బురఖాలు ఎన్ని తగిలించినా సరే !

ఇక ఫిరౌన్ సంగతి సరేసరి. అధికారానికి ఏకైక యజ మాని. అతడు చేసే ప్రతిసైగ చట్టంతో సమానం. అతను వెలిబుచ్చే ప్రతికోరిక న్యాయసమ్మతం.

జన సమూహంలో నిశ్శబ్దత ఆవరించింది. ఆశ్చర్యంగా ఒకర్నొకరు చూసుకోసాగారు. ఫిరౌన్ ప్రకటనలోని భయంకర దృశ్యం అందరికళ్ళెదుట నాట్యం చేసినట్లనిపించింది.

కాని— నేరస్థులుగా పరిగణించబడిన వారిపరిస్థితి! వారిలో విధమయిన భయాందోళనలు లేవు. ఫిరౌన్ ప్రకటనను ారు ఒకచెవితో విని రెండోచెవితో వదిలేశారు. విశ్వాసబలం ంతో గొప్పది. దాని శక్తిముందు మరోశక్తి ఏదీ నిలువజాలదు. ఎవరి హృదయంలోనయితే దైవభీతి చోటుచేసుకుంటుందో వారి దృష్టిలో ఇతర ఏ విధమయిన భీతికూడా భీతి కాజాలదు. ఇంతకుముందు పారితోషికాల భిక్ష కోరుకున్న మంత్రగాళ్ళు, ఈ "ప్రకటన" విని సజ్దానుండి తలఎత్తి ఇలా పలికారు:

"దానివల్ల జరిగేదేముంది ? ఏ యదార్థమయితే మా ముందు స్పష్టంగా వచ్చేసిందో దానికి వ్యతిరేకంగా మేము మీ మాటకు ఎలాంటి ప్రాధాన్యతనూ ఇవ్వలేము. ఇప్పుడు మాకు ఏ విధమైన భయం లేదు. మీ ఇష్టం వచ్చినట్లు చేసుకోండి. మహా అయితే ఇహలోక జీవితంపై మాత్రమే మీ పెత్తనం సాగుతుంది. ఆ తరువాత మీరేమీ చెయ్యలేరు. మేమైతే ఆ మా ప్రభువు వద్దకే పోవలసి ఉంది. ఆయన్నే మేమిప్పుడు మా యజమానిగా అంగీకరించాము కూడా. ఆయన దయాదాక్షిణ్యాలపై మాకు విశ్వాసముంది. ఆయన్ను విశ్వసించడంలో మేము అందరికన్నా ముందు ఉన్నాం. కాబట్టి ఇప్పటివరకు మా వల్ల జరిగిన లోపాలను ఆయన తప్పక క్షమిస్తాడు. సత్యవంతుడయిన ఆయన ప్రవక్తకు వ్యతిరేకంగా మమ్మల్ని నిస్సహాయుల్ని చేసి మంత్రజాలం పేరుతో మా చేత ఆడింపజేసిన ఆటనుకూడా ఆయన క్షమిస్తాడు ఇప్పుడు మా ముందు వాస్తవం తేటతెల్లమయింది. అల్లాహ్‌యే అందరికన్నా గొప్ప ప్రభువు, యజమాని. ఆయనకు నశింపులేదు. మానవుడు ఆయన సమక్షంలో తిరుగుబాటు దారుడుగా, ద్రోహిగా నిలబడ్డాడు. ఇది అన్నింటికన్నా ఘోరమయిన దురదృష్టం. ఇటువంటి ద్రోహుల కోసం ఆయన వద్ద నరకం ఉంది. నరకంలో మనిషి జీవితంపట్ల విరక్తి చెందుతాడు. కాని విముక్తిపొందేందుకు అతనికి చావుమాత్రం రాదు. ఆయనముందు విశ్వాసిగా నిలబడినవాడే ధన్యుడు. అతని సత్కర్మల జాబితాకూడా అతనివెంట ఉంటుంది, ఇటువంటి వారికోసమే ఉన్నతమయిన స్థానాలు ఉన్నాయి. నివసించడానికి సదా సస్యశ్యామలమైన తోటలున్నాయి. అందులో కాలువలు ప్రవహిస్తుంటాయి. అక్కడ్నే వీరు శాశ్వతంగా ఉంటారు.

ఈ బహుమతి, తమ జీవితాలను దైవాభీష్టం ప్రకారం మలచు కున్న వారికే లభిస్తుంది. ఇక మీరు మమ్మల్ని శిక్షిస్తామంటు న్నారు. దాన్ని గురించి మీరుకూడా ఆలోచించుకోండి మేం మీకు కలిగించిన నష్టం ఏమిటి? మాముందు మా ప్రభువుయొక్క స్పష్టమయిన నిదర్శనాలు వచ్చేయగా, సత్యం మాకు తేటతెల్ల మయిపోగా మేమాయన్ని విశ్వసించాము. ఇక ఇప్పుడు మీరు ఏంచేయదలచుకుంటారో చేసుకోండి".

మేము మాత్రం మా ప్రభువును ప్రార్థిస్తున్నాం. "ఓ మా యజమానీ! మేము నీ మార్గంలో స్థిరంగా ఉండగలిగేలా మాపై నీ కారుణ్యాన్ని వర్షింపజెయ్యి. ఏ ధర్మాన్నయితే మేము స్వీక రించామో దాని అనుసరణలో మాకాళ్ళు ఎలాంటి పరిస్థితిలోను తడబడకుండా చేయి. అన్ని సమయాల్లోనూ కష్టాల్ని చిర నవ్వుతో సహించగలిగే శక్తిని ప్రసాదించు. మృత్యువుకూడా మమ్మల్ని మా స్థానంనుండి కదల్చకూడదు. మాకు చావు వచ్చినా, మేము నీ ఆజ్ఞాబద్ధులమై, విశ్వసనీయులమై ఉన్న స్థితిలోనే రానివ్వు."

నవ ముస్లింల ఈ ప్రసంగం, ఈ వేడుకోలు దర్బారు స్వరూపాన్నే మార్చేసింది. ఫిరౌన్ అనుకున్నదొకటైతే జరిగింది మరొకటి. మూసా (అస్సలాం) సందేశ ప్రభావం, ఆయన ఉపదేశాల వల్ల ఏర్పడిన పరిస్థితుల్ని తారుమారు చేయడానికే ఫిరౌన్ ప్రజల్ని సమీకరించాడు. కాని ఈ దృశ్యం తిలకించాక వారి దృష్టిలో మూసా (అలైహిస్సలాం) విలువ వందరెట్లు పెరిగి పోయింది. ఇక ఫిరౌన్, అతని భజనపరులు, ఈ ప్రభావాన్ని అణచడానికి కొత్త పన్నాగాలు పన్నసాగారు.

# ఇస్రాయీల్ జాతిలో ఇస్లాం సందేశ ప్రభావం

ఒక బహిరంగ ప్రదేశంలో ప్రజా సమూహం సమక్షంలో ఫిరౌన్ పరాజయం పాలవటం, మంత్రగాళ్ళు విశ్వాస ప్రకటన చేయడం మామూలు విషయం కాదు. ఈ సంఘటన తర్వాత ఫిరౌన్‌కు వ్యతిరేకంగా ప్రజా ఉద్యమం ప్రభవించి, అధిక సంఖ్యాకులు మూసా (అలైహిస్సలాం)ను విశ్వసించడం జరగవలసింది. కాని తాతముత్తాతల ఆచారవ్యవహారాలు, జాతీయతత్వం, మత తత్వం కళ్ళుమూసుకుపోయేలా చేస్తాయి. సత్యం కళ్ళముందుకు వచ్చిన తర్వాతకూడ దాన్ని అనుసరించడానికి మనసంగీకరించదు. రకరకాల ఆలోచనలు ముసురుకుంటాయి. తాము ఈనాటి వరకు అవలంబించిన ఆచారాలను వదిలేస్తే దానర్థం ఏమిటి ? ఇప్పటివరకూ తాము, తమ తాతముత్తాతలు తప్పుడు మార్గాన్ని అవలంబించినట్లే కదా అని ఒకసారి అనుకుంటే, మూసా (అలై హిస్సలాం) బోధించే ధర్మాన్నిస్వీకరిస్తే తమ ప్రాచీన సంస్కృతి

చుంటకలసి పోతుందే అని మరోసారి అనుకునేవ
సంస్కృతిలో పురాతనత్వం తప్ప మరో మేలు తే
ఒక్కోసారి కొందరి అంధానుసరణకూడా అడుగు
వేయనీయదు. వాస్తవం అర్థమయిపోతుంది. కాని
ఈ మాటే నిజమయితే ఫలానా వారు తప్పక ఒప్ప
ఏం, ఆయన మనకన్నా తక్కువ జ్ఞానం కలవాడా
దాటవేస్తారు: కొన్ని సమయాల్లో అధికారపిపాస ముంద
యదు. అతని ఆంతర్యం లోలోనే అతనిలోని గుణాల్ని
తుంది. నీకన్నా హీనుడు నీ ముందు దిగదుడుపు
వంటి వాడి మాటను ఎలా ఒప్పుకుంటావు ? అని ప్ర
ఇంకోసారి జ్ఞానం, నియమనిష్టల గర్వం దారి కడ్డంగా
తాయి. యదార్థాన్ని అర్థం చేసుకునే బదులు, య
వివరించేవాడిని ఎగాదిగా చూడటం జరుగుతుంది.
హెచ్చరిస్తుంది— ఒకవేళ ఈ అల్పుని మాటలు విం
వాడివెనుక పడతారు సుమా ! అప్పుడు నీ పలుకుబ
తగ్గిపోదూ !? అని. మరికొన్ని సమయాల్లో ప్రభుత్వ
మనసుల్ని ఆవరిస్తుంది. ప్రజలు సత్యాన్ని సత్యమని ఎ
దాన్నుండి తప్పించుకోవడంలోనే తమ శ్రేయస్సు
ఉందని భావిస్తారు. ఇంకా వీలయితే కాస్తోకూస్తో
వ్యతిరేకతకూడా ప్రదర్శిస్తారు.

ఇలాంటి దుర్గుణతలు ఎన్నో ప్రబలి ప్రజల్లో దేవుని
భావన పోగొట్టుతాయి. క్రమేణా అజ్ఞానాంధకారం వ్యా

ఫిరౌన్ అనుయాయుల పరిస్థితీ ఇంతే. తరత
ముష్రిక్‌లుగా జీవిస్తూవచ్చిన వీరిలో సత్యధర్మాన్ని. అను

రవ లేక పోయింది. ఈ స్థితికి బనీ ఇస్రాయీల్ జాతికూడా నయింది. ధర్మం కోరేదేమిటో వారు సంవత్సరాల తరబడి ్సుకోలేక పోయారు. ముఖ్యంగా తరతరాలుగా బానిస ్రతుకు బ్రతికిన కారణంగా దైవప్రవక్తను అనుసరించలేక ోయారు.

మూసా (అలైహిస్సలాం) ఒకవైపు ఫిరౌన్ మరియు అతని ంతివారిలో దైవధర్మాన్ని పరిచయం చేస్తూనే మరోవైపు ఇస్రా ూల్ వంశీయుల్ని సంస్కరించసాగారు. వారిలో ఆధ్యాత్మిక తను జనింపజేయడానికి ఎడతెగని ప్రయత్నం చేయసాగారు. మానవత్వానికి అన్నింటికన్నా గొప్ప శాపం బానిసత్వం. ఇక దైవధర్మమయితే బానిస బ్రతుకులో ఇమడనే ఇమడదు. దైవ ధర్మం మానవుణ్ణి అన్నిరకాల బానిసత్వాలనుండి, అణచివేత నుండి కాపాడి కేవలం అల్లాహ్ దాస్యంలోనే ప్రవేశింపచేయ గోరుతుంది. కాబట్టి. తమ బలహీనతవల్ల ఇతరులకు బానిసలై పోయిన జాతులకు దైవధర్మంతో సంబంధం రోజురోజుకు తరిగి పోతూ ఉంటుంది. ఇస్రాయీల్ వంశీయులకుకూడా అదేగతి పట్టింది. చిరకాలంగా బానిసబ్రతుకులో మ్రగ్గుతూ దైవధర్మంతో వారి సంబంధంకూడా క్షీణించసాగింది. సాధారణంగా బానిస జాతుల్లో జనించే రుగ్మతలే వారిలోనూ జనించాయి. వారిలో జనించిన గొప్పరుగ్మత ఏదంటే, వీరికి కుటీరంకన్నా "పంజరం" ప్రియమయినది. అణగిమణగి ఉండే బడుగు జీవితానికి వారు

అలవాటు పడిపోయారు. బానిసత్వపు సంకెళ్ళను త
పరిస్థితివారిది.

ఇస్రాయీల్ వంశీయులకు మూసా (అలైహి
సందేశం కొత్తదేమీకాదు. పైగా అది వారు మర
పాఠమే. అయినప్పటికీ మూసా (అలైహిస్సలాం)కు త
వారికి కష్టమయిపోయింది,-ముఖ్యంగా ఆ సమయంలో
(అలైహిస్సలాం) పట్లగల వ్యతిరేకతవల్ల ఫిరౌన్ మూస
స్సలాం) తెగవారయిన బనీఇస్రాయీల్‌ను తన క్రోధా
చేసినప్పుడు చాలామంది గగ్గోలు పెట్టారు.

ఫిరౌన్ తెగకు చెందిన సర్దారులు ఫిరౌన్‌ను
చారు- "మూసా మరియు అతని తెగవారిపట్ల ఉ
మెతకగా వ్యవహరిస్తూపోతే వారు పెద్ద కల్లోలం
మీతోసహా మీ దేవతల్ని రంగంనుండి నిష్క్రమింప

పరిస్థితి యొక్క ఈ స్వరూపాన్ని అదుపుచేసేంద
వారొక పథకం రూపొందించారు. ఇస్రాయీల్ వ
శక్తిని అణగార్చేందుకు వారి మగపిల్లలను పుట్టగానే చం
లని, కేవలం ఆడపిల్లల్ని మాత్రం బ్రతకనివ్వాలని ని
బడింది- మూసా (అలైహిస్సలాం) జన్మించినప్పటి రాజ
కూడా ఇటువంటి అజ్ఞనే జారీచేశాడు. ఈజిప్టు ప్రస్తుత
డయిన ఈ ఫిరౌన్‌కూడా అదే ఆజ్ఞను జారీచేశాడు.
విన్న ఇస్రాయీల్ వంశీయులు కలవరపడ్డారు. హజ్రత్
(అలైహిస్సలాం) వారికి ధైర్యం నూరిపోశారు. వారి

యాల్లో దైవ విశ్వాసాన్ని తాజాపరుస్తూ ఈ కష్టకాలంలో స్థిర చిత్తంతో తొణకుర్కుంటా ఉండాలని అల్లాహ్‌ను ప్రార్థిస్తూ ఉండా లని వారికి బోధించారు.

"ఈ కష్టాలు కొన్నాళ్ళవరకే. అతిత్వరలో ఇవి కడతేర తాయి. దేశానికి యజమాని అల్లాహ్‌యే. ఆయన తాను కోరిన వారికి రాజ్యాధికారం అప్పగిస్తాడు. కావల్సిందల్లా ఆయన విశ్వాసపాత్రులయిన దాసులు తమను తాము ఆయన దృష్టిలో యోగ్యులుగా తయారుకావటమే. ఇలా జరిగితే ఇహలోకంలో కూడా వారు ఉన్నతులు కాగలుగుతారు."



# ఇస్రాయీల్ జాతిలో ఇస్లాం సందేశం

మూసా (అలైహిస్సలాం) యొక్క హితబోధ విన్నతర్వాత ఆ ప్రజలు, "అవును. మీరనేది సమంజసమే. కాని ఏం చెయ్యాలో చెప్పండి. మీరీ ఉద్యమం ప్రారంభించక ముందు నుంచీ మేము కష్టాలు అనుభవిస్తూనే వచ్చాము. ఈనాటికీ కష్టాలు మమ్మల్ని విడిచి పెట్టలేదు.

మూసా (అలైహిస్సలాం) ఇంకొకసారి వారికి నచ్చజెప్పారు: "అల్లాహ్ మీ శత్రువులను అంతంచేసే రోజు ఎంతో దూరంలో లేదు. భువిలో ప్రతినిధులుగా (ఖలీఫాలు) మిమ్మల్ని నియమిస్తాడు. దైవ తిరస్కారులు, బహుదైవారాధకుల వలయం నుండి విముక్తులై మీకు అధికారం లభించిన భూభాగంలో మీ ప్రవర్తన ఏ విధంగా ఉంటుందో పరీక్షిస్తాడు".

హజ్రత్ మూసా (అలైహిస్సలాం), అణచివేతకు, హింసా దౌర్జన్యాలకు గురవుతున్న ఆ ముస్లిం సమాజంలో సరైన ధార్మిక

భావన ఉద్దీపింపజేయాలని, వారి హృదయాలలో అల్లాహ్‌పై, పరలోకంపై విశ్వాసాన్ని పునరుజ్జీవింప జేయాలని సకల ప్రయత్నాలు చేశారు. తద్వారా వారు దైవతిరస్కారం, బహుదైవారాధనల శృంఖలాలను తెంచి పారేస్తారని హజ్రత్ మూసా (అస్సలాం) ఆశించారు. కాని కొందరు యువకులు మినహా మరెవరూ మూసా (అలైహిస్సలాం)ను అనుసరించేందుకు సిద్ధం కాలేదు. ఫిరౌన్, అతని సర్దారుల ప్రభావం ఆ సమాజంలోని పెద్దలపై ఎంతగా ఉందంటే వారు అంతగొప్ప శక్తికి వ్యతిరేకంగా ఏమయినా చేయగలం అని కనీసం ఆలోచించలేక పోయేవారు. అంతటి భావ దారిద్ర్యం వారిలో గూడుకట్టుకొని ఉండగా ప్రతిఘటించాలన్న కోరిక ఎలాపుడుతుంది? దానికి తగ్గట్టు ఫిరౌన్ దౌర్జన్యాలుకూడా హద్దుమీరి పోయాయి. ప్రాణాలొడ్డి ఎదుర్కోవాలంటే దృఢమైన విశ్వాసం కావాలి మరి!

యువకులలో దూరదృష్టి, ఆలోచన తక్కువ. విప్లవోద్రేకం ఎక్కువ. వారికేదయినా విషయం బోధపడితే దాని కోసం వారు ఎంతకయినా తెగిస్తారు, ఆపడం చాలా కష్టం. బనీ ఇస్రాయీల్ యువకుల విషయంలోనూ అంతే జరిగింది. మూసా (అలైహిస్సలాం) తన జాతినుద్దేశించి, "సోదరులారా! మీరు దైవంపై విశ్వాసం కలవారయితే ధర్మ మార్గంలో ఎదురయ్యే కష్టాలకు ఎందుకు భయపడుతున్నారు? అల్లాహ్ సహాయంపై నమ్మకముంచండి. నేను చెప్పినట్లుగా నడుచుకునేందుకు సిద్ధపడండి. ధర్మమార్గంనుండి తప్పుకోవడం ధార్మిక బాధ్యతల్ని అసంపూర్తిగా వదలివేయడం ముస్లింలు చేయవలసిన పనికాదు." అని ఉద్బోధించారు.

మూసా (అలైహిస్సలాం) బోధనల ప్రభావం అందరికన్నా యువకులపై ఎక్కువ పడింది. వీరంతా ముక్త కంఠంతో ఎలుగెత్తి చాటారు, "మాకు దైవ సహాయంపై పూర్తి భరోసా ఉంది. మేము మిమ్మల్ని అనుసరించటానికి సంసిద్ధులుగా ఉన్నాం." అని చెప్పి "ఓ ప్రభూ! మమ్మల్ని దుర్మార్గుల పాలిట ఎరగా చేయకు. నీ కరుణా కటాక్షాలతో మమ్మల్ని నీ ధిక్కారుల నుండి రక్షించు." అని అల్లాహ్‌ను ప్రార్థించారు.

ఆ ముస్లిం యువకుల ఉత్సాహం చూడండి. పెద్దవాళ్ళు, వృద్ధులు రకరకాల అనుమానాలు సంశయాలలో పడిపోయి యువకుల్ని కూడా వెనక్కి మళ్ళించే ప్రయత్నం చేస్తున్నారు. కుటుంబం సర్వనాశనమవుతుందనీ, తమ వృద్ధాప్యాన్ని చూసి అయినా వారి ప్రయత్నం విరమించుకోవాలని నిరుత్సాహపరచజూశారు– కాని దైవదాసులైన ఆ యువకులు ఒకసారి దైవ సందేశం విన్నారు. ధర్మం తమపై మోపే బాధ్యతను తెలుసుకున్నారు. ఒకవైపు ధర్మం మరోవైపు అధర్మం. పరస్పర విరుద్ధ శక్తులలో ఏదో ఒక దానితో సఖ్యం చేయాలని ప్రతివ్యక్తి నిర్ణయించుకోవలసి వచ్చింది. అటువంటి నాజూకు పరిస్థితులలో విశ్వాసులు తాము సత్యంతోనే సఖ్యం చేయాలని నిర్ణయించుకుంటారు. ఇహలోక జీవితంలో దాని పర్యవసానం ఎలా ఉన్నాసరే! ఔను. వారు అలాంటి నిర్ణయం ఎందుకు తీసుకోరూ! వారిముందు జయాపజయాల అసలు కొలమానాలు వచ్చేశాయి. వారికి తెలుసు– నిజ యజమాని ప్రసన్నుడవడమే విజయమనీ. ప్రాపంచిక సుఖం కోసం సత్యాన్ని తిరస్కరించడమే అపజయమనీ. ఈ సందర్భంగా వారు ప్రార్థించారు.

"ఓ ప్రభూ ! మమ్మల్ని దుర్మార్గుల పాలిట పీడగా చేయకు." ఇది చాలా ముఖ్యమయిన ప్రార్థన. ఇందులో ఎన్నో అర్థాలు దాగి ఉన్నాయి. వాటిని అర్థం చేసుకోండి. దైవ తిరస్కారం, అధర్మాలదే పైచేయిగా ఉన్నప్పుడు. కొందరు ధర్మపతాకాన్ని బూని ఉద్యమించితే వారికి అనేకరకాల వ్యక్తులు తారసిల్లుతారు. కొందరు విస్పష్టంగా విముఖత చూపుతారు. పూర్తిశక్తితో సత్య ధర్మ ధ్వజవాహకుల్ని అణచివేయ ప్రయత్నిస్తారు. కొందరయితే ఈ ధర్మాన్ని బహిరంగంగా వ్యతిరేకించజాలరు. తాము కూడా ఈ ధర్మాన్ని అనుసరించే వారమేనంటారు. కాని వారికి ప్రభుత్వ భయం ఉంటుంది. వారు తమ సుఖశాంతులకు లోటు కలగటాన్ని సహించలేరు, వారు పయనిస్తున్న జీవిత నౌక ఏ దిశలో పయనిస్తున్నదో ఆ దిశ మార్చుకోవడం వారికి కష్టమనిపిస్తుంది. వారికి, తమ వ్యాపార వ్యవహారాలు, వ్యవసాయం, ఉద్యోగం, ఇల్లువాకిళ్ళనష్టం కళ్ళముందు కదలాడుతూ ఉంటుంది. అందుకని వాళ్ళేమంటారంటే, "మీరు చెప్పేది నిజమేననుకోండి, కాని ఆ పని కోసం ఇది సరయిన సమయం కాదు. ప్రస్తుతం ఇటువంటి ప్రయత్నాలు వ్యర్థం. దీనివల్ల ఫలితమేమీ కలగదు. ప్రయోజనం సున్నా. దీనివల్ల మనల్ని మనం ఇరకాటంలో పడవేసుకోవడమే అవుతుంది." అంటూ వీరు ధార్మిక ప్రయత్నాలను నీరు కారుస్తారు. ధర్మం నోరు నొక్కడానికి శాయశక్తులా ప్రయత్నిస్తారు. ఎందుకంటే ఈ స్థితిలో వీరికి రెండువిధాల కష్టాల్ని ఎదుర్కోవలసి వస్తుంది. ఒకటి వారు, ఇంతవరకు అనుభవిస్తూ వస్తున్న సుఖాలకు ఆనకట్ట పడుతుంది. రెండు, ప్రజలకు ధార్మిక విధులు, బాధ్యతలు తెలిసి రాగానే వారు. "అయ్యా! ధర్మం కోరేది ఫలానా అయితే

మీ బోటి ధార్మికులు ఇందుకు భిన్నంగా చేయడం సబబు కా
గదా !" అంటారు. అందుకని ఈ వర్గంవారు ధర్మోన్నతికి పా
పడే ప్రతి ఉద్యమాన్నీ పూర్తి శక్తితో వ్యతిరేకిస్తారు.

ఇక మూడో రకంవారు, దూరంనుంచే పరిస్థితుల్ని గ
నిస్తూ ఉంటారు వారు ఎటువైపు పరిస్థితులు అనుకూలంగా వుం
అటువైపు మొగ్గు చూపుతారు. గోడమీది పిల్లి వాటంవీరి



# ధన మదాంధుడు ఖారూన్

ఇటువంటి పరిస్థితుల్లో సత్యధర్మ ధ్వజవాహకులకు ప్రత్యక్షంగా ఏదయినా అపజయంకలిగినా, లేక వారివల్ల ఏదయినా తప్పిదాని, పొరపాటుగాని సంభవించినా లేక వారికేదయినా ఆపదముంచుకొచ్చినా, లేక ఏ సందర్భంలోనయినా వారిలో ఏదయినా బలహీనత కనిపించినా వారు ఈ విభిన్న వర్గాల పరీక్షకు కారణభూతులవుతారు.

ఒకవేళ వారు (సత్యధర్మ ప్రేమికులు) అణచివేయ బడటమో లేక ఓడిపోవటమో జరిగితే మొదటివర్గంవారు, "చూశారా ! ధర్మం మావైపువుంది, ఆ తలతిక్కవారివైపు కాదు" అనంటారు. రెండోవర్గంవారు, "మేము ముందరే హెచ్చరించాం, ఇటువంటి విషయాలకిది తగిన సమయంకాదని. అనవసరంగా పెద్ద పెద్ద శక్తులతో తలపడితే పర్యవసానం (చేమగా ఉండక) ఏమవుతుంది ? ఎన్నో కొన్ని ధార్మికవిధులు ఏదోరకంగా పూర్తి అవుతూనే ఉన్నాయి కదా ! నమాజ్, రోజాల నుండి ఎవరు నిరోధిస్తున్నారు ?" అని చెప్పిపాడుస్తారు.

ఇక మూడో వర్గంవారు ఏమంటున్నారో వినండి; "గెలిచిన వాడే ఉత్తముడు."

సత్యధర్మ ధ్వజవాహకుల వల్ల ఏకాస్త పొరపాటు జరిగినా, లేక వారిలోని ఒక వ్యక్తియొక్క నైతికలోపం లేదా బలహీనత ఎదుటికొచ్చినా చాలు, ఎంతోమంది ప్రజలకు అధర్మాన్ని, అప మార్గాన్ని అనుసరిస్తూ ఉండటానికి వేలాదివంకలు దొరుకుతాయి.

ఇటువంటి సందర్భంలోనే మూసా (అలైహిస్సలాం) అను చరులు "ఓ ప్రభూ ! మమ్మల్ని కరుణించు. అన్నిరకాల అప జయాలనుండి, పొరపాట్లనుండి మమ్మల్ని దూరంగా ఉంచు. ఎందుకంటే ఈ పరిస్థితుల్లో మా వైఫల్యంవల్లనో, మాలోని లోపం వల్లనో ధర్మసందేశానికి ఏదయినా నష్టం జరుగవచ్చు. ప్రజలు మా పరిస్థితిని చూసి నీ ధర్మంవైపుకు మరలేబదులు వెనుకంజ వేస్తారేమో !" అంటూ దైవాన్ని వేడుకున్నారు.

సత్య సందేశ ప్రచారంతోపాటు మూసా (అలైహిస్సలాం) బనీ ఇస్రాయీల్ మరియు ఇతర విశ్వాసుల శిక్షణ కోసం ఏర్పాట్లుకూడా చేశారు, నాడు ఫిరౌన్ ప్రభుత్వంలో, ముస్లింలకు కనీసం సామూహిక నమాజ్ చేసుకోడానికయినా స్వతంత్రం ఇవ్వబడలేదు. అటువంటి క్లిష్టపరిస్థితుల్లో నమాజ్ వ్యవస్థను స్థాపించుకోడానికి, విశ్వాసులకు శిక్షణ గరపడానికి మూసా (అలైహిస్సలాం) మరియు ఆయన సోదరునికి అల్లాహ్ సూచన అందించింది—"మీరు నగరంలోని కొన్ని ఇండ్లను ఎన్నుకోండి, అందరూ కలిసి ఆ గృహాల్లో నమాజ్‌ను స్థాపించండి, విశ్వాసుల హృదయాలనుండి నిరాశ నిస్పృహల్ని తొలగించి, బలహీనతల్ని దూరంచేసి వారిని ఉత్సాహవంతులుగా మలచండి. వారిలోని విశ్వాసాన్ని తాజాపరచండి. సాఫల్యం పొందేది ఇలాంటి వారేనని వారికి బోధించండి" అని.

ఇస్లాం ఏ ఉద్యమం కొరకయితే మానవుల్ని తయారు చేయబోతుందో, దాని శిక్షణకోసం పరిపూర్ణ విశ్వాసం కలిగిన తర్వాత ముందుగా నమాజ్‌ను స్థాపించే విషయానికి ప్రాధాన్యత నిస్తుంది. నమాజ్‌ను స్థాపించే ఏర్పాటు చేయనివర్గం, మరేపని అయినా చేయగలదేమో కాని, ధార్మికకార్యం మాత్రం చేయజాలదు* నమాజ్‌ను స్థాపించే బాధ్యతను నెరవేర్చగలిగే వారు మాత్రమే ధార్మికసేవ చేయగలరు.

---

*1. నమాజ్‌ను స్థాపించడం అంటే ఏ విధంగా నమాజ్‌ను చేయాలో ఆ విధంగా చేయాలని బావం.

2. నమాజ్‌ని అర్థం చేసుకుని ఎంతో వినమ్రులై ఏకాగ్రతతో చేయాలి.

హజ్రత్ మూసా (అలైహిస్సలాం) ఇస్రాయీల్ వంశీయులలో నిర్వర్తించిన సందేశం, సంస్కరణా కార్యక్రమం మూలంగా ఎందరో వ్యక్తుల జీవితాలు కొత్తమలుపు తిరిగాయి. ఆ ప్రదేశంలోనే ప్రవక్తహితబోధను పెడచెవిన పెట్టిన దౌర్భాగ్యులుకూడా ఉన్నారు. పైగా వారు మార్గభ్రష్టతతో మరింత మూర్ఖంగా వ్యవహరించసాగారు. ఆ కోవకు చెందినవారిలో ఖారూన్‌కూడ ఒకడు. ఖారూన్ హజ్రత్ మూసా (అలైహిస్సలాం) జాతికి చెందినవాడే.

ఖారూన్ మార్గవిహీనతకు ప్రధానకారణం అతని సిరిసంపదలు, భోగభాగ్యాలే. బనీఇస్రాయీల్ పెట్టుబడి దారీ మనస్తత్వానికి ప్రస్ఫుటమైన నిదర్శనం ఖారూన్. అల్లాహ్ అతనికి అంతులేని సిరిసంపదలు ప్రసాదించాడు. కాని ఖారూన్ ఆ పరీక్షలో నెగ్గలేకపోయాడు. ధనమదంతో తన్నుతాను మరచిపోయాడు. గర్వంతో విర్రవీగాడు. తన సిరిసంపదల అండ చూసుకుని బలహీనులను పీడించసాగాడు. అతని ఖజానాల తాళపు

---

3. వేళకు సామూహికంగా నమాజ్ సలపాలి.

4. నమాజ్‌లోని అంశాల్ని ఆగి ఆగి నిదానంగా ఆచరించాలి.

5. నమాజ్‌లోని విషయంలో అంతర్బాహ్యాలలో లభించే ఆజ్ఞల్ని, షరతుల్ని, విధానాన్ని దైవగ్రంథం మరియు మహాప్రవక్త (సఅసం) ఆచరణలో లభిస్తాయి. వాటిని ఖచ్చితంగా అనుసరించాలి.

చెవుల సుత్తులు కొందరు మనుషులు కలిస్తేగాని మోం బడుప్పనా ఉండేవి. వాన్నిబట్టి అతనికున్న ధనరాసుల్ని కట్టిపచ్చు !

ఈ ధనమదం ప్రాతిపదికపైనే ఫిరౌన్ దర్బారులో ప్రవేశం లభించింది. కాని అతను తన ఈ పలుకుబ కుని తన జాతివారిపట్ల మరింత కఠినంగా ప్రవర్తించేవా ప్రతిష్టలకోసం, ప్రభుత్వ అధికారుల మెప్పుకోసం తన పిసికివాడు. ఈ విధంగా తన దర్జా ప్రదర్శించేవాడు. కుయుక్తులతో అతను తన ఆస్తిపాస్తుల్ని పెంచుకున్నాడ



# ధన మదాంధుడు ఖారూన్‌పై దైవశిక్ష

ఒకసారి ఖారూన్ జాతివారు ఖారూన్‌ను కలిసి అతనిలో దైవభీతిని కలిగించే ప్రయత్నం చేశారు. "చూడు అలా విర్రవీగకు. గర్విష్టులంటే అల్లాహ్ ఇష్టపడడు. దైవం నీకిచ్చిన దానితో నీ పరలోక జీవనసామగ్రిని కూడబెట్టుకో. పేదలను ఆదుకో. ఆర్తులకు సహాయం చేయి. ఈ సిరిసంపదల్ని ఖర్చు చేసే అసలు విధానం ఇదే. అంటే.... దాని అర్థం నీ ఆస్తంతా దైవమార్గంలో ఖర్చు చేసేయమనికాదు. నీ వంతు వాటాను నీ సుఖశాంతుల కోసం వాడుకో. కాని అల్లాహ్ నీకు సంపద నిచ్చి నీపై మేలు చేసినట్లే నీవుకూడా బలహీనులయిన దైవదాసులకు సాయపడు. మేలుచేయి. ఆస్తిని ఈ విధంగా కూడబెట్టి ఉంచడం, వీలైనంత ఎక్కువ ఆస్తి సంపాయించాలనే పేరాశలో పడి ధర్మాధర్మాల విచక్షణ పాటించక ఇతరులపై జులుం చేసి ధనాన్ని కూడబెట్టే వైఖరిని విడనాడు. ఇదే నిజానికి ప్రపంచంలో కల్లోలం చెలరేగటానికి గొప్పకారణం. నీవు ఇటువంటి కల్లోలం

నుంచి బయటపడు; కల్లోలాన్ని రేకెత్తించే ఇలాంటి వారిని అల్లాహ్ ప్రేమించడు. వీరు ఇతరులపై జులుం చేస్తారు. వారి హక్కుల్ని కాజేసి ప్రపంచ శాంతిని భగ్నం చేస్తారు."

ఎంత మంచి మాటలివి !— కాని ఖారూన్ ఏమన్నాడు ? అతనిలాంటి ఈనాటి కల్లోలకారులు అనేమాటలే అన్నాడు. "ఈ డబ్బూ వస్త్రం, భోగభాగ్యాలు నేను నా తెలివితేటలతో కూడబెట్టాను. ఇందులో ఎవడికేం హక్కుందని. నేను నా కష్టార్జితాన్ని, చెమటోడ్చి కూడబెట్టిన దాన్ని అనవసరంగా పేదసాదలకు ఎందుకు ఖర్చు చేయాలి ?" అన్నాడు.

నిజమే. కళ్ళు పొరలుగమ్మినవాడు, అసలు దాతనే (అల్లాహ్) మర్చిపోయిన వాడు. తనకు ముందు గతించినవారి చరిత్రనుండి గుణపాఠం గ్రహించనివాడు అయిన వ్యక్తి హృదయం నుండి ధనమదాన్ని తొలగించడం అంత సులభం కాదు. ఒకవేళ ! ఖారూన్‌కు కనువిప్పు కలిగితే, తనకు పూర్వం ఎందరో బలవంతులు, పొగరుబోతులు మృత్యువాతనబడ్డారని ఈనాడు వారి విషాదగాథలు తప్ప వారిదంటూ ఏమీ మిగలలేదని అతను తెలుసుకోగలిగేవాడు. ఇది ప్రపంచంలో జరిగే విషయం మాత్రమే. పరలోకంలో అటువంటి వారికి అంతకంటే గొప్ప వినాశం ఉంది ! ఆ రోజున వారి కర్మలన్నీ తేటతెల్లమవుతాయి. వారి దుష్కృత్యాలు ఎంత వివరంగా వ్యక్తమవుతాయంటే, వాటిని గురించి ఆ దుర్మార్గుల్ని అడగవలసిన అవసరమే ఉండదు.

సిరిసంపదలు సుఖభోగాలలో పెద్దమోసం ఉంది. ఈ శాపానికి గురయిన వ్యక్తిని చూసిన ప్రజలకు అతడు వినాశం వైపుకు లాగబడుతున్నాడనే ఆలోచనకూడా రాదు. అతడు నిజంగా గొప్ప భోగభాగ్యాలతో తులతూగుతున్నాడని అనుకుంటారు. విజయం అతన్నే వరిస్తోందనుకుంటారు. అదృష్టం అతనికే పాదాభివందనం చేస్తూందని భావిస్తారు. కాని అసలు విషయం వేరుగానే ఉంటుంది. ఇదే పరిస్థితి ఖారూన్‌కీసు—

ఒకరోజు అతడు డాబూదర్పంతో తన బంధువుల ముందుకు వచ్చాడు. ప్రాపంచిక జీవితంవెనుక ఉన్న వాస్తవ కత ఏమిటో పూర్తిగా తెలియని బంధువులు మోసంలో పడ్డారు వారు ఖారూన్ స్థితిగతుల్ని చూసి ఈర్ష్యచెందారు. "ఖారూన్‌కు లభించిన ధనం మాకూకూడా లభిస్తే ఎంతబాగుండు! అతనెంత అదృష్టవంతుడో చూశారా!?" అన్నారు కాని వారిలో కొందరు స్పష్టంగా వాస్తవికత ఎరిగిన వారుకూడా ఉన్నారు. అసలు జీవితం ఏదో, నిజమయిన సాఫల్యం అని దేనినంటారో వారికి తెలుసు. ప్రాపంచిక సంపద ఒక పరీక్ష అని, ఆ పరీక్షలో ఖారూన్ ఘోర పరాజయం పొలవుతున్నాడని వారెరుగుదురు. వీరు ఆ మూర్ఖుల ఈర్ష్యాపూరిత మాటలు విని బాధపడ్డారు, "మిమ్మల్ని చూస్తే మాకు విచారం కలుగుతూంది. మీరు ఈర్ష్య పడుతున్న ఈ సిరిసంపదలకన్నా దైవం ప్రసాదించే పుణ్యం ఎంతో మేలయినది. ఈ పుణ్యం విశ్వసించిన వారికోసం, తమవెంట సత్కార్యాల మూట కట్టుకుని వెళ్ళే వారికోసం ఉంటుంది- కాని ఈ పుణ్యం ధర్మమార్గంలో స్థిరంగా ఉండేవారికి తమ మనోవాంఛల్ని

ఆదుష్టలో పెట్టుకునే వారికి, కలిమిలో ఉన్నా లేమిలో ఉన్నా అన్ని పరిస్థితుల్లోనూ అల్లాహ్ ఆజ్ఞల్ని తు.చ. తప్పకుండా పాటించే వారికిమాత్రమే లభిస్తుంది. ఈ మాత్రం మీకు తెలియదా ?" అని నచ్చజెప్పారు.

ఖారూన్ ధనమదంతో, అహంభావంతో అలా వింటూ ఉండిపోయాడు తప్ప వారిమాటలు అతడ్ని ఏ మాత్రం ప్రభావితం చేయలేకపోయాయి. చివరికి అల్లాహ్ నిర్ణయించిన గడువు పూర్తయింది. అల్లాహ్ విధించిన శిక్ష అతనిపై విరుచుకుపడింది. భూమి బ్రద్దలయింది. ఖారూన్ తన అందాల భవంతితో సహా భూగర్భంలోకి కూరుకుపోయాడు. పాపం! అతని సిరిసంపదలూ మిగల్లేదు, హెూదా అంతస్తులుకూడా మట్టిలో కలిసిపోయాయి. భజనపరులూ, భట్రాజులూ కళ్ళప్పగించి చూస్తూ ఉండిపోయారు. అల్లాహ్‌కు వ్యతిరేకంగా ఖారూన్‌కు ఏ ఒక్కడూ ఉపయోగపడలేదు. ఎక్కడ్నించయినా ఏదయినా సహాయం కూడా లభించలేదు

తెల్లవారింది. అందరూ ఖారూన్ మహల్ ఉండే ప్రదేశం చూశారు. అక్కడ ఇప్పుడేమీ మిగల్లేదు. ఖారూన్, అతని భోగభాగ్యాలు అన్నీ సర్వనాశనమయ్యాయి. సమస్తం భూస్థాపితం అయిపోయింది ఖారూన్ మాదిరిగా ధనవంతులవుదాం అని అనుకున్నవాళ్ళు అప్పుడు కళ్ళు తెరుచుకున్నారు. విషయమంతా వారికి అవగతమయింది. "సరే! ఇదంతా దైవేచ్ఛ.

తాను కోరిన వారికి కలిమిని కలిగిస్తాడు. తాను కోరినవారిని లేమిలో పడవేస్తాడు. అల్లాహ్ మాకు మేలు చేశాడు. మమ్మల్ని ఖారూన్‌లా పుట్టించలేదు. ఖారూన్‌కు పట్టిన దుర్గతికూడా మాకు పట్టలేదు. అతనితోపాటు మేము భూస్థాపితం కాలేదు. ఆహా! కర్మఫలం ఎటువంటిది? కృతఘ్నులు ఎన్నటికీ సాఫల్యం పొందలేరు" అని అన్నారంతా ముక్తకంఠంతో.

అసలు విజయం పరలోక విజయమే. అక్కడ ఫిరౌన్ అధికారంవంటి అధికారంగాని, ఖారూన్ సంపద వంటి సంపద గాని తోడ్పడజాలవు. భువిలో ఫిరౌన్‌లా దుర్మార్గులు ఖారూన్‌లా ధన మదాంధకారులు కానటువంటి అదృష్టవంతులదే పరలోక భాగ్యం. పరలోకం భయభక్తులు కలవారి (ముత్తఖీలు)దే. ప్రతి క్షణం దైవాగ్రహానికి భయపడేవారిదే. దేవుని అభీష్టానికి వ్యతిరేకంగా ఎటువంటి పని చేయని వారికే ఈ మహా భాగ్యం లభిస్తుంది.



# ఫిరౌన్ దర్బారులో ఒక నవముస్లిం

ఫిరౌన్ నానాటికీ పెరిగిపోతున్న మూసా (అలైహిస్సలాం) యొక్క ప్రచార ప్రభావాన్ని గమనించాడు. ఫిరౌన్, బనీ ఇస్రాయీల్ వారి పుత్రసంతతిని మట్టుపెట్టే పథకం నడిపినా అది అతనిలోని క్రోధాగ్నిని చల్లార్చలేకపోయింది. మూసా (అలైహిస్సలాం)ను, ఆయన అనుచరులను రకరకాలుగా బెదిరించాడు. ప్రాణాలు తీస్తానని, జైలుపాలు చేస్తానని భయపెట్టాడు. ఆయన జాతివారిపై వెట్టిచాకిరీ తీవ్రతరం చేశాడు. వారిపై గట్టి బందోబస్తు ఏర్పాటు చేసి వారిపట్ల అప్రమత్తంగా ఉండాల్సిందిగా ఉత్తర్వులు జారీచేశాడు. కాని మూసా (అలైహిస్సలాం) చెప్పిన ప్రతిమాట సత్యమయినది అవడంచేత అది ప్రజల హృదయాలను ఆకట్టుకుంటుంది. పైగా ఆయన మహాత్మ్యాలు బహిర్గతమయ్యాయి. ఫిరౌన్ పిలిపించిన మంత్రగాళ్ళు ఓడిపోయిన తర్వాత ప్రజలు, నిస్సందేహంగా మూసా (అలైహిస్సలాం)కు మద్దతునిచ్చే దైవశక్తి ఏదో వుందనే నిర్ణయానికి రాక తప్పలేదు. ఆయన తాను దైవప్రవక్తనని ప్రకటించినప్పుడు

ఆయన చెబుతున్నది అబద్ధమని ఖండించడం అంత తేలిక విషయంగా భావించలేదు ప్రజలు.

మూసా (అలైహిస్సలాం) సందేశానికి బనీ ఇస్రాయీల్ వారేకాక ఫిరౌన్ జాతివారు కూడా ప్రభావితులవసాగేరు. మూసా (అలైహిస్సలాం) అభిమానుల సంఖ్య దినదిన ప్రవర్ధమానం కాసాగింది. ఈ క్రొత్త ఉద్యమానికి ప్రభావితులయ్యే వారిసంఖ్య, అభిమానుల సంఖ్య ఫిరౌన్‌ను హడలగొట్టాయి. అతనికి మనశ్శాంతి లేకుండా పోయింది. మూసా (అలైహిస్సలాం) కు మరణ శిక్ష విధిస్తేతప్ప లాభంలేదనుకున్నాడు ఫిరౌన్. అతని తొందరపాటును పవిత్ర ఖుర్ఆన్‌లోని పదజాలాన్ని బట్టి అంచనా వేయవచ్చు

"మూసా (అలైహిస్సలాం)ను అంతంచేస్తాను, నన్ను వదలండి. అతడు తన ప్రభువును పిలవనీండి. ఆయన వచ్చి అతన్ని ఎలా కాపాడతాడో చూద్దాం— ఒకవేళ అతన్ని అంత మొందించకపోతే అతడు మీ జీవిత వ్యవస్థనుమార్చివేస్తాడని, లేదా దేశంలో పెద్దసంచలనం కలిగిస్తాడనినాకు భయమేస్తోంది" అన్నాడు ఫిరౌన్.

మూసా (అలైహిస్సలాం)కు కూడా ఫిరౌన్ నిర్ణయం గురించి తెలిసింది. ఆయన అన్నారు, "దానివల్ల ఏమవుతుంది? పరలోకంలో జవాబు చెప్పవలసి ఉందనే విశ్వాసం లేనివారి బారిన పడకుండా ఉండేందుకు నన్ను నేను నా ప్రభువు, యజమాని (అయిన అల్లాహ్) రక్షణలో సమర్పించుకున్నాను. ఆయన నాకే కాదు మీకుకూడా యజమాని, ప్రభువే."

జీవన్మరణాలు కేవలం దైవంచేతిలో ఉన్నాయని నమ్మి వారు, తాము చేస్తున్నదంతా దైవప్రసన్నత బడయుటానికే అని విశ్వాసంకలవారు, జలజంతులందరికన్నా ఆయన మిక్కిలి బలవంతుడని, ఆయనతీర్పును ఎవరూ జవదాటలేరని దృఢవిశ్వాసం కలవారు, ఉరి, జైలుశిక్షల నిర్ణయాలు విని ఎందుకు భయపడతారు ? కాబట్టి మూసా (అలైహిస్సలాం) ఫిరౌన్ యొక్క ఉద్దేశ్యానికి అంతగా ప్రాముఖ్యత నివ్వలేదు.

ఫిరౌన్ తన ఈ నిర్ణయాన్ని తన దర్బారు వారిముందర వారి సలహాకోసం ఉంచినప్పుడు ఒకాయన లేచి వింతపద్ధతిలో ఆ నిర్ణయాన్ని విమర్శించసాగాడు. ఈయనకూడా ఫిరౌన్‌జాతి చెందినవాడే. కాని ఆయన మూసా (అలైహిస్సలాం) సందేశాన్ని విశ్వసించినవాడు.

ఫిరౌన్‌కుగాని అతని అంతరంగికులకు గాని ఈ నవముస్లిం ఇస్లాం స్వీకరించిన విషయం తెలియదు. మూసా (అలైహిస్సలాం)ను హత్యచేయాలని ఫిరౌన్ ఉద్దేశించాడని, కొందరు దర్బారీలు కూడా ఇదే సలహా ఇస్తున్నారని విన్న ఆయన ఇక సహించలేకపోయాడు. ఆయన ప్రాణాలకు తెగించి నిండుదర్బారులో ఈ ప్రకటన చేశాడు. "నా ప్రభువు, పాలకుడు అల్లాహ్ అని ప్రకటించిన వ్యక్తికి మరణశిక్ష విధించనున్నారా ? ఆయన చేసిన నేరం ఏమిటి ? పైగా ఆయన చెప్పేమాటలకు ఆయనవద్ద స్పష్టమైన ఆధారాలున్నాయి గదా ? మీ ప్రభువుద్వారా సంక్రమించిన నిదర్శనాలను ఆయన మీకు చూపాడుకూడా.

"ఈ పరిస్థితుల్లో రెండే మార్గాలున్నాయని మీరు గమనించాలి. తాను దైవప్రవక్త అని, తాను చెబుతున్నదంతా దైవం తరఫునే చెబుతున్నాను అని చేసేవాదన అబద్ధపు వాదనయి ఉండాలి. ఒకవేళ ఇదే నిజమనుకున్నట్లయితే మీపై ఆయన ప్రభావం ఏమీ పడజాలదు. ఆయన ఇలా చెప్పిచెప్పి పోతుంటాడు. ఇవాళ కాకపోతే రేపయినా ఆయన బండారం బయట పడవచ్చు— కాని ఆలోచించవగ్గ విషయమేమంటే ఒకవేళ ఆయన సత్యవంతుడయితే ఆయన్ని చంపినందువల్ల మీకు ఒరిగేదేమీ లేదు. మీ ముందు దైవోపదేశం వచ్చేసింది. ఆ సందేశహరుణ్ని ప్రాణాలతో విడిచిపెట్టడమో లేక చంపేయడమో చేసినంత మాత్రాన మీ రాత మారదు. ఆయన చూపిన మార్గాన్ని మీరు అంగీకరిస్తారా లేదా అన్న విషయంపైనే మీ అదృష్టం ఆధారపడి ఉంది.

"ఒకవేళ మీరు దైవ ధిక్కార మార్గాన్నే అంటిపెట్టుకుని ఉంటే, దైవధిక్కారులకు సంభవించే పర్యవసానం (శాపం) ఎట్టి పరిస్థితుల్లోనూ మిమ్మల్ని విడిచిపెట్టదు. ఆయన్ని మీరు ఉరికంబానికి వ్రేలాడగట్టినా సరే!— దైవదాస్య పరిధిని అతిక్రమించే వారికి, అబద్ధాల కోరులకు అల్లాహ్ ఇహలోక జీవితంలో విజయవంతమయిన సన్మార్గంపై నడిచే భాగ్యం ప్రసాదించడు".

"నా జాతి సోదరులారా!.... ఇవాళ మీ అధికారం మీదే కావచ్చు. ప్రభుత్వం మీ చేతిలో ఉండవచ్చు. దేశంలో మీకు ఆధిక్యత, పలుకుబడి ఉండవచ్చు. కోరినట్లు చేయగల స్థితిలో మీరు ఉండవచ్చు. కాని పరిస్థితులు ఒకేలా ఉండవు. అల్లాహ్ శక్తి మీ శక్తికన్నా ఎంతో గొప్పది. మీ దుష్ప్ర

వర్తనవల్ల మీపై దేవునిశాపం విరుచుకు పడితే దానికి వ్యతి
కంగా సహాయపడే వారెవరు ?"

ధైర్యవంతుడయిన ఆ పెద్దమనిషి ప్రకటన విన్న సభలో
నిశ్శబ్దత అవరించింది. ప్రకటన చేసినవ్యక్తి పలుకుబడిగల
పెద్ద అధికారి కాబోలు. అందుచేతనే అధికారానికి వెంటనే
ఆయన్ని బంధించి జైలుకు పంపే ధైర్యం ఫిరౌన్‌కు కూడా లేక
పోయింది. కాని ఇదంతా విన్న ఫిరౌన్ "నేను సరయినదని
భావించే దాన్నిగురించే సలహా ఇస్తాను. అందరి శ్రేయస్సు ఇమిడి
ఉన్న మార్గాన్నే చూపుతాను" అన్నాడు.

ఆ పెద్ద మనిషి ఫిరౌన్ మాటలను ఖాతరు చేయకుండా
తన ఉపన్యాసాన్ని ప్రభావవంతం చేయడానికి ఇంకా ఇలా చెప్ప
సాగాడు :

"సోదరులారా! మీ ఈ ధోరణి చూస్తుంటే మీకంటేముందు
గతించిన జాతులకు పట్టినగతే మీకూ పడుతుందేమోనని నాకు
భయంగా ఉంది. ఉదాహరణకు నూహ్, ఆద్, సమూద్
జాతులు ఇంకా ఆ తర్వాత వచ్చిన అలాంటి వారే అయిన అనేక
జాతులు. గుర్తుంచుకోండి! అల్లాహ్‌కు తన దాసులపై జులుం
చేసే ఉద్దేశ్యం లేదు. కాని వారు చేజేతులా చేసుకున్న దుష్క
ర్మలే వారిని పట్టి ముంచుతాయి.

"సోదరులారా! నేను ఆ రోజుగురించి భయపడుతున్నాను.
ఏ రోజయితే మీపై అల్లాహ్ శాపం విరుచుకు పడుతుందో. సహా
యం కోసం ఆ రోజు మీరు ఒకర్నొకరు పిలుచుకుంటారు. భయ

విహ్వాలులై వెన్నుచూపి పారిపోతారు. కాని ఆ రోజు అల్లాహ్ పట్టునుండి మిమ్మల్ని రక్షించే వారెవరూ కానరారు- గుర్తుంచుకోండి అల్లాహ్ ఎవరినయితే వారి తప్పుడు ధోరణి, ప్రవర్తనవల్ల సద్బోధనుండి దూరం చేస్తాడో ఆ దురదృష్ట వంతుల్ని ఎవరూ సన్మార్గం వైపుకు తీసుకురాలేరు.

"మీకు గుర్తుండే ఉంటుంది. గతంలో హజ్రత్ యూసుఫ్ (అలైహిస్సలాం) అనే దైవప్రవక్త ఇదే సందేశాన్ని తెచ్చారు. కాని మీరు అప్పుడుకూడా దానిపైశ్రద్ధ చూపలేదు. ఆయన బోధలపట్ల అనుమానంలోనే మునిగిపోయారు. చివరికి ఆయన పరమ పదించగా మీరు అమ్మయ్య! అనుకుంటూ, అల్లాహ్ ఇకపై ఏ ప్రవక్తనూ ఎంత మాత్రం ప్రభవింపజేయడు అని తృప్తిపడ్డారు. కాని ఈ దేశాన్ని తన సద్బోధనుంచి మినహాయించడం అల్లాహ్ కారుణ్యానికి వ్యతిరేకం".

ఫిరౌన్ దర్బారులో ఈ నవముస్లిం తన ప్రసంగాన్ని కొనసాగిస్తూ ఇలా అన్నాడు :

"కాబట్టి అల్లాహ్ మరోసారి మనపై తన అనుగ్రహాన్ని కురిపించాడు. ఆయన తన ప్రబోధనాజ్యోతిని మనపై ప్రసరింపజేశాడు. దానివల్ల మార్గభ్రష్టత్వపు కారుచీకట్లు పటాపంచలవుతాయి. ఈ రాజ్యంలో నివసించేవారికి మళ్ళీ సన్మార్గం లభిస్తుంది. ఈ మహా భాగ్యానికి మీరిచ్చే విలువ ఇదేనా ?

"గుర్తుంచుకోండి. ఒక దాసుడు దాస్యపరిధిని అతిక్రమించి, విశ్వాసం, నమ్మకాలకు బదులుగా అపోహలకు లోనయితే

ఆతనికి సన్మార్గం ఏనాటికీ లభించదు. అలా ఆ వాస్తు నిరంతరం దారితప్పి తిరుగుతూనే ఉంటాడు. అటువంటి వారిని గుర్తించడమెలా అంటే వారిదగ్గరికి తమ ప్రభువుకు సంబంధించిన విషయాలు వచ్చినపుడు వారు అనవసరంగా వితండవాదానికి దిగుతారు. ఏ విధమయిన ఆధారాలు ప్రమాణాలు లేకుండానే జగడం చేస్తారు— అల్లాహ్ మరియు విశ్వాసుల దృష్టిలో వారి వైఖరి అత్యంత హేయమయినది.

"వినండి. మీరు అవలంబించిన ఈ వైఖరి ఎంతమాత్రము సరయింది కాదు. అహంకారంతో అంధులవుతున్నవారు, తిరుగుబాటుతనం, తలబిరుసుతనంతో మత్తెక్కిన వారే ఈ వైఖరి నవలంబిస్తారు. అటువంటి వైఖరి అవలంబించినందుకు పర్యవసానంగా అల్లాహ్ వారిని సద్బోధ వెలుగునుండి దూరం చేస్తాడు. అల్లాహ్ వారి హృదయాలకు సీలువేశాడా అన్నట్లు వారి హృదయాలు సత్యాన్ని స్వీకరించడానికి వీలులేకుండా మూసుకుపోతాయి?"

నవ ముస్లిం ఉపన్యాసం విని ఫిరౌన్ ఉగ్రుడయ్యాడు. హృదయాలను కాంతివంతం చేసే ఈ మాటల్ని సహృదయంతో ఆలోచించే బదులు ఆతను వాటిని తేలిక భావంతో త్రోసిపుచ్చాడు. పైగా మూసా (అలైహిస్సలాం), ఆయన అనుయాయుల్ని ఎగతాళి పట్టించే ఉద్దేశ్యంతో తన దర్బారులో ప్రధాన అధికారి అయిన హామాన్‌ను సంబోధించి ఇలా అన్నాడు :

"సరేనోయి హామాన్! ఒక ఎత్తయిన భవనాన్ని కట్టించు. మేము దానిపై ఎక్కి ఆకాశంపైకి చేరుకునే ప్రయత్నం చేస్తాము,

అక్కడ వారి అల్లాహ్‌ను తొంగిచూస్తాం. అసలు అల్లాహ్ అనే వాడు ఎవడైనా ఉన్నాడో లేడో మేమూ ప్రత్యక్షంగా చూస్తాం. ఈయనగారు అబద్ధమాడుతున్నాడనే నా నమ్మకం."

ఇదీ ఫిరౌన్ వరస! అతడికి తన దుశ్చర్యలు ఎంత అందంగా కనబడుతున్నాయి! సన్మార్గం వైపుకు పురోగమించటానికి ఎన్నెన్ని ఆటంకాలు అతడిముందు అడ్డుగోడలుగా నిలిచాయి!!— కాని ఫిరౌన్ యొక్క ఈ కపటచేష్టలన్నీ అతనికే మాత్రమూ లాభించకపోగా వినాశానికే ఇంకా చేరువ చేస్తున్నాయి.

కాని విశ్వాసి అయిన ఆ మహాపురుషుడు దర్బారులో ఫిరౌన్ చేసిన ఈ వ్యర్థ ప్రేలాపనను ఏ మాత్రం పట్టించుకోలేదు. పైగా ఎంతో ప్రేమతో మనసుల్ని ఆకట్టుకునేలా సభికుల్ని ఉద్దేశించి ఇంకా ఇలా అన్నాడు:

"సోదరులారా! నేను మీ ముందుంచిన మార్గాన్నే అవలంబించండి. మీ శ్రేయస్సు ఇందులోనే ఉంది. ఇదే సన్మార్గం, సత్యమార్గమూను.

"సోదరులారా! వినండి, మరో వాస్తవికత వైపుకు మిమ్మల్ని పిలుస్తున్నాను. ఆలోచించండి? ఈ జీవితం ఎన్నాళ్ళో ఉండదు. దాని పర్యవసానం అందరూ ఎరిగిందే. ఇక్కడ ఉన్న ఈ ఐహిక సంపద ఎన్నాళ్ళుంటుందో ఎవరికెరుక? ఎన్నాళ్ళు దీనితో మీరు ప్రయోజనం పొందగలరు? ఈ జీ తరువాత ప్రారంభమయ్యేదే నిజమయిన శాశ్వత జీవితం. తంగా ఉండేది ఇహలోకం కాదు, పరలోకమే. కాబట్టి వాన్ని స్పష్టంగా మీ ముందు ఉంచుతున్నాను. శాశ్వత

ఉండే పరలోకంలో లభించే విజయమే అసలు విజయం. సంపద, గౌరవం, అధికారం మొదలయిన ప్రాపంచిక ఆకర్షణల కోసం మానవుడు పరలోక సాఫల్యాన్ని విస్మరించి తప్పుడు మార్గం అవలంబించడంకన్నా మరో మూర్ఖత్వంలేదు. గుర్తుంచుకోండి, చెడు చేసిన వారికి తగిన ప్రతిఫలం లభించి తీరుతుంది.

"వినండి. పరలోక సాఫల్యానికి ఒక్కటే మార్గం. స్త్రీలైనా, పురుషులయినా సత్కార్యాలు* చేసినవారే స్వర్గంలో ప్రవేశించగలరు. అయితే వారు విశ్వాసులు** కావడం అవసరం. అలాంటి వారికి స్వర్గంలో లెక్కలేనన్ని మహా భాగ్యాలు లభిస్తాయి.

నవ ముస్లిం మాటలు విన్నాక ఫిరౌన్‌కు, అతని దర్బారు వారికి ఇక వీరినిబెదిరించి భయపెట్టి వీరి మార్గాన్నుండి తప్పించలేమని గ్రహించారు. ఏ మార్గమునయితే వారు ఆలోచించి, అర్థం చేసుకుని అవలంబించారో దాన్నుండి వారిని దూరంగా ఉంచడానికి ఫిరౌన్, అతని అనుయాయులు వారికి ఎన్నో ఆశలు చూపి బతిమాలారు, నయానభయానా ఆయినాసరే తమ ఉద్దేశ్యాన్ని నెరవేర్చుకుందామని ప్రయత్నించారు.

---

* సత్కార్యాలు అంటే దైవాజ్ఞలకు లోబడి ఉండి, దైవ ప్రీతికోసం చేసే మంచి పనులన్నమాట.

** విశ్వాసులు– విశ్వాసం అంటే అల్లాహ్‌పై. ఆయన ప్రవక్తలపై, పరలోకంపై, విశ్వాసం ఉంచడం (దైవ ప్రవక్త (సఅసం) తెలిపిన వివరణతో సహా). దైవప్రవక్త (సఅసం) బోధించిన వాస్తవాలను విశ్వసించడంకూడా చేరివుంది.

కాని ఎవరి హృదయాల్లో విశ్వాసం దృఢంగా నాటుకుని ఉంటుందో వారు ఎన్నికష్టాలు వచ్చినా వెనుకంజ వేయరు. ఎటువంటి దురాశ అయినా వారిని వారి స్థానంనుండి తప్పించ జాలదు. ఈ నవముస్లిం విషయంలోనూ ఫిరౌన్ ఎత్తుగడలన్నీ చిత్తయిపోయాయి. ఆయన ఫిరౌన్, అతని అనుయాయుల ప్రయత్నాలకు జవాబుగా ఇలా అన్నాడు :

# అచంచల విశ్వాసం - అద్భుత సందేశం

నవముస్లింను తమవైపుకు తిప్పుకోవడానికి ఫిరౌన్, అతని అనుయాయులు వేసిన పాచికలేవీ పారలేదు. నవముస్లిం దైవ ధర్మంపై స్థిరంగా ఉండటమే కాకుండా మరొకసారి తన జాతి ప్రజలను ఉద్దేశిస్తూ ఇలా హితవు చేశాడు.

"సోదరులారా ! ఇన్నిమాటలెందుకు ? ఒక విషయం ఆలోచించండి. నేను మిమ్మల్ని ఎటువైపుకు పిలుస్తున్నాను, మీరు నన్ను ఎటు తీసుకెళ్ళడానికి ప్రయత్నిస్తున్నారు? మిమ్మల్ని

నేను శాశ్వత సాఫల్యం వైపుకు పిలుస్తున్నాను. మోక్షం వైపుకు ఆహ్వానిస్తున్నాను. శాశ్వతంగా ఉండే పీడనుండి మిమ్మల్ని విముక్తంగావించే ప్రయత్నం చేస్తున్నాను. మీరేమో నన్ను సర్వనాశనం వైపుకు, శాశ్వత పరాజయంవైపుకు లాక్కెళ్ళాలని చూస్తున్నారు.

"నేను మనందరి అసలు యజమాని అయిన విశ్వ ప్రభువును తిరస్కరించి ఆయన దైవత్వంలో ఇతరుల్ని సాటి కల్పించాలనేగా మీరు కోరుకుంటున్నది. ఈ విషయం వైపుకా మీరు నన్ను పిలుస్తున్నది! నేను ఇతరుల దాస్యాన్ని అవలంబించమంటున్నారా? జీవితంలోని కొన్నిపనులలో దైవానికి, మరి కొన్ని పనుల్లో దైవేతరులకు వినమ్రత చూపాలా?— ఆయన్ని తిరస్కరించడానికి, ఇతరుల్ని ఆయనకు సహవర్తనులుగా నిలబెట్టడానికి నా వద్ద ఎటువంటి ఆధారాలు లేకపోయినా నేనీపని చేయాల్నా? కాని నేను మిమ్మల్ని విశ్వప్రభువుయొక్క దాస్యం వైపుకు పిలుస్తున్నాను. ఆయన సమస్త అధికారుల్లోకెల్లా గొప్ప అధికారి. ఆయన సమక్షంలో ప్రతి 'దైవత్వం' ఒక మోసం తప్ప మరేమీకాదు. ప్రతిశక్తి నిస్సారమయింది. అంతటి అపార శక్తిశాలి అయిన ఆ దేవుడు అమిత దయాళువుకూడా. ఆయన విధేయతవైపుకు మరలాలని నిశ్చయించుకున్నవాడు ఎంతటి తిరుగుబాటుదారు, ద్రోహి అయినాసరే ఆయన దర్బారులో అతనికి క్షమాభిక్ష లభించగలదు. నేను ఇలాంటి దైవాన్ని ఆరాధించమనే మిమ్మల్ని కోరుతున్నాను.

"పోతే మీరు నన్ను ఏ జీవితవ్యవస్థ వైపుకయితే పిలుస్తున్నారో అదినాకు పరలోకంలోనూ సాఫల్యత చేకూర్చదు. ఇహ

లోకంలోనూ నాకేమాత్రం ఉపయోగపడదు వాస్తవమేమంటే, మనందరం చివరికి అల్లాహ్‌వైపుకే మరలవలసి ఉంది. అతనికు ద్రోహులయిన వారి నివాసం నరకం మాత్రమే. సోదరు లారా ! నేను చెప్పవలసినదంతా చెప్పాను. ఇక మీ ఇష్టం. త్వరలో ఆ సమయం ఆసన్నం కానున్నది. అప్పుడు నేను చెప్పిన ఈ మాటలన్నీ మీకు గుర్తుకువస్తాయి.

"ఇక నా సంగతంటారా, మీ ఇష్టం వచ్చినట్లు చేసుకోండి. నేనైతే నా వ్యవహారాలన్నిటినీ అల్లాహ్‌కు నివేదిస్తున్నాను. అల్లాహ్ సమస్తమూ చూస్తున్నాడని నా విశ్వాసం. ఆయనే తన దాసుల పర్యవేక్షకుడు—"

ధైర్యశాలి, పెద్దమనిషి అయిన ఆ విశ్వాసి తన హిత బోధను ముగించాడు. ఫిరౌన్, అతని అనుచరులు ఆయన (మూసా)కు వ్యతిరేకంగా ఎన్నోకుతంత్రాలు పన్నారు. కాని దైవసహాయం లభించిన వారికి ఎవరు కీడుచేయగలరు ? చివరికి వారి కుయుక్తులన్నీ వ్యర్థమయ్యాయి. వారు పన్నిన కుట్రలన్నీ భగ్నమయ్యాయి. అల్లాహ్ తన విశ్వాసి అయిన దాసుని వారి జిత్తులనుండి రక్షించాడు. పైగా వారి దుష్ట ఎత్తుగడలు వారికే ఎదురుతిరిగాయి. తాము త్రవ్వుకున్న గోతిలో తామే పడినట్లయింది వారిపని.



ఫిరౌనీయులపై రకరకాల శిక్షలు రాసాగాం
ఇస్లామీయ సందేశానికి వ్యతిరేకంగా వారు పని
వారే చిక్కుకున్నారు. తమ దుష్టకర్మల ఫలిత
నరకాగ్నిలో నైతే పడనున్నారో అది వారికి ప్రతినిత్య
తోంది. ఈ భయానకదృశ్యమే వారికి తుది దినాన
జరుగుతుంది. అప్పుడు "ఈ ఫిరౌనీయులందరికీ
మైన శిక్షకు గురిచేయండి" అన్న ఆజ్ఞ వారిచెవ
స్తూ ఉంటుంది.

# దైవతిరస్కారులపై ఉపద్రవాల

కాలక్రమాన సంభవించే విపత్తులను లెక్క
అంతర్యాలు దేన్నయితే సత్యమని ఘోషిస్తాయో
వైపుకే పయనించే వైద్యస్థులు ప్రతికాలంలోనూ
ఉంటారు. సాధారణంగా ప్రజలు ప్రతికొత్త విషయ
రించేముందు తండ్రితాతల ఆచార వ్యవహారాలు,
తెమ్ములు, అప్పటి అధికారుల వైఖరిని గమనిస్తా.

యుల స్థితి అంతే. వేళ్ళమీద లెక్కించదగ్గ కొందరు తప్ప తక్కినవారెవరికీ మూసా (అలైహి) సందేశాన్ని స్వీకరించి, ఇస్లామీయ ఉద్యమానికి చేయూతనిచ్చే ధైర్యం లేకపోయింది. అలాంటి పుణ్యమూర్తులయిన దైవదాసులలో ఒకరిని గురించి మీరు తెలుసుకున్నారు. ఫిరౌన్‌ను ఖాతరు చేయక ఇస్లామీయ సందేశాన్ని స్వీకరించిన రెండోవ్యక్తి స్వయంగా ఫిరౌన్ భార్యయే.

ఖుర్‌ఆన్‌లో ఆ మహనీయ స్త్రీ అచంచల విశ్వాసాన్ని అల్లాహ్ ప్రస్తావిస్తూ ఆమెను నిజమయిన విశ్వాసిగా పేర్కొన్నాడు. గౌరవనీయురాలగు ఆమె ఫిరౌన్ మహలులో ఉంటూ ఇస్లామీయ విశ్వాస మార్గాన్ని అవలంబించడం ఎంతకష్టమైనా ఊహించడం కష్టమేమీ కాదు. కాని విశ్వాసంయొక్క వాస్తవికత తేటతెల్లమయితే అంతరాత్మ బొత్తిగా చావనివ్యక్తి తప్పుడు స్థానంలో పడి అలాగే ఉండలేడు. ప్రత్యేకంగా పరలోకం గురించిన వాస్తవికత కళ్ళెదుటకు వచ్చినప్పుడు మానవుడు స్వార్థంకోసం అంతరాత్మ గొంతును నులమడంగాని భయం, పిరికితనాల కారణంగా ధర్మానికి చేయూతనివ్వడానికి వెనుకంజ వేయడం గాని జరగదు, ఫిరౌన్ భార్యకూడా అంతే. ఆమె ఇస్లామ్ సందేశాన్ని విని, అర్థం చేసుకుని మరీ స్వీకరించారు. పర్యవసానం ఏమవుతుందా అన్న ఆలోచనే ఆమెకు రాలేదు. రాజ ప్రాసాదాలలో నివసించడం సాధ్యం కాకపోవచ్చు లేదా పేదరికం దైన్యాలను ఎదుర్కోవలసిన స్థితికూడా రావచ్చు. ఇంకా ఫిరౌన్ ఆమె చొరవకు సజీవంగా ఉంచనూవచ్చు లేదా వెంటనే ప్రాణాలు తీయనూవచ్చు. అయితే ఆమె ఇటువంటి అనుమానాలకు తావివ్వక నిజమైన విశ్వాసురాలిగా అల్లాహ్‌ను ప్రార్థించారు.

"ఓ ప్రభూ ! స్వర్గంలో నీచెంత నాకొక స్థానాన్నివ్వు. ఫిరౌన్ నుండి నన్ను విముక్తం చెయ్యి. ఫిరౌన్ చేయించే దుష్కృత్యాల నుండి కాపాడు. ఓ నా స్వామీ ! నీకు వ్యతిరేకంగా నడుంకట్టిన ఈ దుష్టజాతినుండి నన్ను రక్షించు."

అల్లాహ్ ఇటువంటి విశ్వాసులు, సజ్జనులు అంటేనే ఇష్టపడతాడు. దుర్భర పరిస్థితులలో, కఠినాతి కఠినమయిన పరీక్షా సమయంలోకూడా సత్యమార్గాన్ని వీడకుండా ఉండటమే నిజమయిన విశ్వాసానికి గుర్తు.

ఇటువంటి పుణ్యమూర్తులు కొందరు తప్ప తక్కిన జాతి యావత్తూ సత్యాన్ని స్వీకరించక తిరస్కరించింది. వారు దైవప్రవక్తను తృణీకరించారు. ఆయన మహిమలను మంత్రజాలమన్నారు. చివరికి వారు ఆయన్ను చంపివేయడానికి కూడా ప్రయత్నాలు చేశారు.

అల్లాహ్ కరుణామయుడు. ఆయన మౌలికగుణాలు కనికరించడం, కరుణించడమే. తన దాసులు భ్రష్టమార్గాలలో పడి జీవితం గడపడం, ఆ విధంగా వారు శాశ్వతంగా ఉండే తమ పరలోక జీవితాన్ని నాశనం చేసుకోవడం ఆయనకెంత మాత్రం నచ్చదు. అదేవిధంగా ఆయన ఫిరౌనీయులపైకూడా కనికరించాడు. ఎవరయితే దైవసందేశాన్ని తిరస్కరించి యావత్తు జీవితాన్ని వినాశమార్గం వైపుకు మరల్చుకున్నారో అటువంటి అవిధేయులకు ఆయన ఋజుమార్గంచూపే ఏర్పాటు చేశాడు. తన ప్రవక్తలయిన హజ్రత్ మూసా (అలైహిస్సలాం) మరియు హజ్రత్ హారూన్ (అలైహిస్సలాం) లను వారివద్దకు పంపాడు. కాని ఆ

ప్రజల కళ్ళు అహంకారంతో మూసుకుపోయాయి. వారి ప్రాపంచిక వ్యామోహం సద్బోధ వినకుండా వారి చెవుల్ని మూసేసింది. అటువంటి స్థితిలో అల్లాహ్ వారికళ్ళు తెరవడానికి మరో ఏర్పాటు చేశాడు. వారిపై అనేకరకాల చిన్నచిన్న ఉపద్రవాలు రాసాగాయి. ఒకప్పుడు వర్షాభావంతో కరువు ఏర్పడితే మరొకప్పుడు పంటలు దెబ్బతిని పండ్లదిగుబడి తగ్గిపోవడం జరిగేది. ఒక్కోసారి తుఫాను భీభత్సాన్ని సృష్టిస్తే మరోసారి మిడతలదండు పంటల్ని తుడిచిపెట్టేది అంతేకాదు, పేలు, చిన్నచిన్న కీటకాలు కందిరీగల వంటి అత్యల్ప జీవులు, మరొకప్పుడు కప్పల వంటి మామూలు ప్రాణులుకూడా అకస్మాత్తుగా తమ సంఖ్యను పెంచుకొని వారి జీవితాల్ని దుర్భరం చేసేవి. ఒకసారయితే ఆకాశాన్నుండి నెత్తుటి వర్షమే కురిసింది.

ఇదంతా ఎందుకు జరిగింది ? వీటికి భయపడి వారు సన్మార్గం అవలంబిస్తారేమో లేదా ఇవన్నీ యాదృచ్ఛికంగా జరుగుతున్నాయా లేక వీటివెనక దైవశక్తి ఏమయినా ఉందా అని ఆలోచిస్తారేమోనని అల్లాహ్ వీటిని సృష్టించాడు. కాని వారి అజ్ఞానాంధకారం వారికివిధంగా ఆలోచించే అవకాశమే కల్పించలేదు ఎప్పుడూ. దీనికి భిన్నంగా వారు ఎలా ఆలోచించారో చూడండి : "మనకు మంచి స్థితిగతులు ఏర్పడ్డాయంటే అదంతా మన తెలివితేటలు దూరాలోచనల వల్లనే ఏర్పడ్డాయి." కాని కష్టాలు ఎదురయినప్పుడు "మూసా (అలైహిస్సలాం) ఆయన అనుచరుల మూలంగానే ఇవి మనకు దాపురించాయి" అని భావించేవారు.



(7) దైవ ప్రవక్తలు IV

# అహంకారుల అంతం సమీపించిన వేళ

ఫిరౌనీయులకు ఈ ఉపద్రవాలు ఎంత బాధాకరంగా తోచాయంటే ఒక్కొసారి వారు బెంబేలెత్తి పోయేవారు. అప్పుడు వారి అంతర్యాలు ఎవరివైపునయితే మూసా (అలైహి) మనల్ని ఆహ్వానిస్తున్నారో ఇదంతా ఆ సృష్టికర్త, యజమాని తరఫునుండే సంభవిస్తున్నాయని ఘోషించేవి. కష్టాలలో సహనాన్ని కోల్పోయిన వారు మూసా (అలైహి)తో, "మీరు దైవంతో మా కొరకు ప్రార్థించండి. ఒకవేళ మీ ప్రార్థనవల్ల మేము ఈ కష్టాలనుండి గట్టెక్కితే మేం తప్పకుండా మిమ్మల్ని విశ్వసిస్తాము. అంతే కాదు, మీ ప్రభువును ఆరాధించడానికి, ఆయన పేర జంతువుల్ని ఖుర్బానీ చేయడానికి ఇస్రాయీల్ సంతతివారికి అవకాశం కూడా కల్పిస్తాము" అనేవారు. కాని కష్టాలు తొలగిపోగానే వారు మాటతప్పి మునుపటిలాగే ప్రాపంచిక సుఖభోగాలలో మునిగిపోయేవారు.

సరే! ఒక శిక్ష తరువాత మరో శిక్ష వారిపై పడుతుండేది. మొదటి శిక్షకంటే రెండోది కాస్త కఠినంగా ఉండేది. కాని ఫిరౌన్ మరియు ఫిరౌనీయుల ప్రవర్తనలో మాత్రం ఏ విధమైన మార్పు వచ్చేదికాదు. పాపాత్ములు, నేరస్థుల మనస్తత్వం ఎప్పుడూ ఒకేరకంగా ఉంటుంది. కాస్త గమనిస్తే ఈ చెప్పే దంతా కేవలం చారిత్రక ఘటనగా మాత్రమే కాక నేటి మన పరిస్థితులకు దర్పణంగా ఉందనికూడా మీరు గ్రహించగలరు. ఈ కాలంలోనూ మానవులు కళ్ళుతెరవడానికి వారిపై ఒకటి, రెండూ కాదు, వందల ఉపద్రవాలు వచ్చిపడుతున్నాయి. ఒకప్పుడు కరువుకాటకాలు సంభవిస్తే మరొకప్పుడు వరదలు భీభత్సాన్ని సృష్టిస్తున్నాయి. ఒక్కోసారి భూకంపం, మరోసారి తుఫాను, ఒకప్పుడు అంటురోగాలు మరొకప్పుడు యుద్ధాలు, మతకల్లోలాలు విజృంభించి మానవులకు సుఖశాంతులు లేకుండా చేస్తున్నాయి. అయితే మిథ్యావాదులు ఈ ఉపద్రవాలకు భౌతిక కారణాలు వెదుక్కుంటారే తప్ప వీటివెనుక ఉండే అదృశ్యశక్తిని గురించి ఆలోచించరు. ఇవన్నీ వాటంతటఅవే సంభవిస్తున్నాయని తలుస్తారు.

ఆ విధంగా ఫిరౌనీయులు మూసా (అలైహిస్సలాం)ను ధిక్కరించి దేవుని నిదర్శనాలను అపహాస్యం చేసారు. మూసా (అలైహిస్సలాం) ఇస్లాం ప్రచారం మొదలుపెట్టి నలభై ఏళ్ళు కావస్తున్నాయి. విశ్వాసులుగా మారిన వారు మారారు మిగిలినవారు ఇక ఏవిధంగానూ సన్మార్గం వైపుకు మరలరని విషయం స్పష్టమయింది.

ధర్మప్రచార కార్యంలో నిమగ్నులయిన వారికి ప్రపంచం లోని ఇతర విషయాలకన్నా తాము కేవలం దైవప్రీతికోసం, పరలోక సాఫల్యం కోసం చేపట్టిన లక్ష్యమే ప్రియంగా ఉంటుంది. ఆ లక్ష్యసాధనలో వారికి బంధువుల బాంధవ్యంగాని, దేశాభిమానంగాని, మరే బంధంగానీ అడ్డురావు. వారికి స్వస్థలం, వ్యాపారం, బంధుమిత్రులు, ఆస్తులు ఆటంకంగా పరిణమించినప్పుడు, వాటన్నిటినీ వదలిపెట్టి ఇస్లామీయ ఉద్యమం అభివృద్ధి చెందే, ధర్మ సంస్థాపన మార్గాలు సుగమం అయ్యే అవకాశాలు కల ఏ చోటుకయినా వెళ్ళిపోవడానికి వారు తయారవుతారు. హిజ్రత్ (వలసపోవడం) అంటే ఇదే. హిజ్రత్ కేవలం ధార్మిక ప్రయోజనాలు ఆశించి మాత్రమే చేయబడుతుంది. దైవప్రవక్తలకై దైవం తరఫున హిజ్రత్ నిర్ణయమవగానే ఆ విషయం వారికి తెలుపబడుతుంది. అదేవిధంగా హజ్రత్ మూసా (అలైహిస్సలాం)ను కూడా "నా దాసులను రాత్రికిరాత్రే ఈజిప్టునుండి తీసుకు వెళ్ళిపో." అని ఆజ్ఞాపించడం జరిగింది.

ఒకరాత్రి హజ్రత్ మూసా మరియు హజ్రత్ హారూన్ (అలైహిస్సలాం)లు బనీఇస్రాయీల్ ప్రజల్ని తీసుకుని పాలస్తీనా వైపుకు ప్రయాణం కట్టారు. వారలా కొంతదూరం పోయారో లేదో ఫిరౌన్ మనుషులకు బనీ ఇస్రాయీల్ ప్రజలు పట్టణం విడిచి వెళ్ళారన్న సంగతి తెలిసింది. వెంటనే వారు ఫిరౌన్‌కు కబురు పంపారు. ఇది విన్న ఫిరౌన్ ఉగ్రుడయ్యాడు. ప్రతి ఊరికీ గూఢచారులను పంపించాడు. "వీళ్ళుచూస్తే గుప్పెడు

మంది లేరు, తమ చేష్టలతో మమ్మల్ని రెచ్చగొట్టారు. వారి ధైర్యం ఎంతగా పెరిగిందంటే వారివల్ల మాపై ఒక విధమయిన ప్రమాదం వచ్చిపడేలా కనిపిస్తోంది." అన్నాతతను.

ఫిరౌన్ తన సకల సైన్యాల్ని సమీకరించాడు. బనీ ఇస్రాయీల్ వారిని వెంటాడేందుకు స్వయంగా తానుకూడా బయలుదేరాడు. ఈ బానిస వెధవలు ఎంతదూరం పోతారులే అనుకున్నాడు. ఇప్పుడే వారిని పట్టి పూర్తిగా అంతమొందిస్తానని తలపోశాడు. కాని అటు దైవాభీష్టం మరోలా ఉంది. ఫిరౌన్, అతని అనుచరులు తమ మహాళ్ళను, ఉద్యానవనాలను, తమ ఖజానాలను, తమ సుఖశాంతులను వదలి మృత్యుకుహరంలోకి అడుగుపెట్టబోతున్న విషయం ఎవరికి తెలుసు ?

సూర్యోదయం కాగానే ఫిరౌన్ సైన్యం బనీ ఇస్రాయీల్ వారిని వెంటాడ్డానికి బయలుదేరింది. అప్పుడు హజ్రత్ మూసా (అలైహిస్సలాం), ఆయన అనుచరులు ఒక క్లిష్టమయిన ప్రదేశానికి చేరుకున్నారు. అక్కడ్నుంచి వారు ముందుకు సాగాలంటే ఎర్రసముద్రానికి ఉత్తరంగా ఒక ఇరుకయిన జలసంధిని దాటవలసి వచ్చింది. వెనుకచూస్తే, ఫిరౌన్ సైన్యం రావడం వారికి కనిపించింది. మూసా (అలైహిస్సలాం) అనుచరులు భయాందోళనలు వెలిబుచ్చారు. ముందుచూస్తే సముద్రం, వెనుకచూస్తే శక్తివంతమైన శత్రుసైన్యం. అందువల్ల "ఇక మేము పీళ్ళకు చిక్కిపోయినట్లే. ఇప్పుడు మనకు దారేమిటి ?" అని చింతించసాగారు.



# సామిరి జాలంలో బనీ ఇస్రాయాల్

ఇటువంటి సందర్భాలలోనే అల్లాహ్‌పై దృఢ విశ్వాసం ఆయన ఉనికిపై పూర్తి భరోసా ఉంచవలసింది. ఇదే విశ్వాసానికి డాలుగా ఉపయోగపడేది. హజ్రత్ మూసా (అలైహిస్సలాం) తన అనుచరుల్లో ధైర్యం కలిగించారు.

"లేదు. ఎంతమాత్రం లేదు. ఇలా ఎన్నటికీ జరగదు. నా ప్రభువు నా (పక్షాన)తో ఉన్నాడు. ఆయన ఇప్పుడే మనకు ఏదయినా మార్గం చూపిస్తాడు". అన్నారు ఆయన వారిభయాన్ని పోగొడుతూ.

ఇటు అల్లాహ్ మూసా (అలైహిస్సలాం)కు "ముందుకు సాగు, సముద్రంపై నీ లాఠీతో కొట్టు" అని ఆజ్ఞాపించాడు.

హజ్రత్ మూసా (అలైహిస్సలాం) లాఠీతో కొట్టగానే మరోకొత్త అద్భుతం జరిగింది, లాఠీ మరోకొత్త మహిమను

చూపింది. సముద్రం రెండుగా చీలిపోయింది. రెండుపాయల మధ్య చక్కని దారి ఏర్పడింది. సముద్రపు నీరు ఆ దారికి రెండుప్రక్కల కొండల్లా నిలిచిపోయింది. హజ్రత్ మూసా (అలైహిస్సలాం) తన అనుచరులతో ఆ దారిగుండా సముద్రాన్ని దాటారు. ఫిరౌన్ సైన్యం ఆ ప్రదేశాన్ని సమీపించక ముందే వీరు అవతలి ఒడ్డుకు చేరుకున్నారు. వీళ్ళు చేజారిపోవడం చూసిన ఫిరౌన్ క్రోధంతో మరింత ఉడికిపోయాడు. మరో ఆలోచన చేయకుండా అతను వెంటనే ఆ దారివెంబడే బనీ ఇస్రాయీల్ వారి వెనకాల గుర్రాలను దౌడు తీయించాడు.

ఫిరౌన్, అతని అనుచరులు చీలిపోయిన సముద్రంలో మధ్యభాగానికి చేరుకోగానే దైవాజ్ఞతో సముద్రపు రెండుభాగాలు మరలా కలుసుకున్నాయి ఫిరౌన్, అతని అనుచరులు అంతా సముద్రంపాలయ్యారు. చూస్తుండగానే వారి శవాలు నీటిపై తేలాయి.

అటువంటి విపత్కర పరిస్థితిలో ఫిరౌన్ స్థితి చూడండి. అతను నీట మునగసాగాడు. ఇక బ్రతికి బట్టకట్టలేనని తెలుసు న్నాడు. తన దైవత్వంకాని, తన సైనికసిబ్బందిగాని తనను ఏనక్కుండా రక్షించలేరని గ్రహించాడు. అప్పుడు అప్ర యత్నంగా అతని నోట ఈ మాటలు వెలువడ్డాయి :

"నేను బనీ ఇస్రాయీల్ వారు తమ ప్రభువుగా, యజ మానిగా అంగీకరించిన దైవాన్ని విశ్వసిస్తున్నాను. ఆయనతప్ప

మరో దేవుడులేడు. ఇప్పుడు నేనుకూడా ఆయనకు విధేయు లయిన వారిలో చేరిపోతున్నాను."

కాని మరణఘడియలు ఆసన్నమయ్యాక విశ్వసించేందుకు అవకాశమే ఉండదు. తనకు స్వయంనిర్ణయాధికారం ఉన్నప్పటి వరకే మానవుడి పరీక్షాసమయం ఉంటుంది. కాబట్టి ఫిరౌన్‌కు ఇలా జవాబివ్వబడింది :

"ఇప్పుడు విశ్వసిస్తున్నావా. అంతకు ముందయితే అవిధే యతే చూపావు. నీవు పరమ దుర్మార్గుడివి."

మొత్తానికి ఫిర్ఔన్ సముద్రంలో మునిగిపోయాడు. అతని అనుచరులు సముద్రంలోని చేపలకు ఎర అయ్యారు. కాని ఫిరౌన్ శవాన్నిమాత్రం అల్లాహ్ భద్రంగా ఉంచాడు. ప్రజలు చూసి గుణపాఠం గ్రహించేందుకు ఆశవం తేలుతూవచ్చి ఒడ్డుకు చేరింది, ఫిరౌన్- ఒకప్పుడు తనశక్తి సామర్థ్యాలు చూసుకొని విర్రవీగి దైవప్రవక్తలను హేళన చేసినవాడు ; దైవధర్మాన్ని తృణీకరించినవాడు; తనముందు శిరస్సువంచాలని తననే దైవంగా కొలవాలని లక్షలాది ప్రజల్ని బలవంతపెట్టినవాడు; తన ఇష్ట ప్రకారం అందరూ జీవించాలని శాసించినవాడు— ఈనాడ ఎంతటి దిక్కులేని స్థితిలోపడి ఉన్నాడు !

ఈ నాటికీ ఫిరౌన్ శవం ఈజిప్టు మ్యూజియంలో ఉంది దానిపై ఉప్పుపొర ఉందని తెలుస్తోంది.

ఫిరౌన్ సముద్రంలో మునిగిపోయాడు. బనీ ఇస్రాయీల్ ప్రజలకు అతని పీడననుండి విముక్తిలభించింది. వారు తమ శత్రువు వినాశం కళ్ళారా చూశారు, మూసా (అలైహిస్సలాం) వారందర్నీ తీసుకుని పాలస్తీనావైపు ప్రయాణమయ్యారు దారిలో సీనా (సినాయ్) లోయలగుండా ప్రయాణించారు. అక్కడ విగ్రహారాధకుల జాతి ఒకటి కనిపించింది. అనేక చోట్ల మందిరాలు కట్టి ఉన్నాయి. అందమయిన విగ్రహాలు ఉన్నాయి, పండితులు, పూజారులు వాటిముందు తలలువంచి కూర్చుని ఉన్నారు ఇదిచూసిన బనీ ఇస్రాయీల్ ప్రజలు మూసా (అలైహిస్సలాం)తో "వాళ్ళ విగ్రహాల్లాంటివి మాకూకొన్ని దేవతావిగ్రహాలు చేయించి ఇవ్వండి" అని అడిగారు.



చూశారా! బనీ ఇస్రాయీల్ ప్రజలస్థితి! వీరు ప్రవక్తల సంతానం, దేవుని ఏకత్వం, ఇస్లామ్ వారి తాతముత్తాతల ధర్మం అయినప్పటికీ దశాబ్దాలుగా బహుదైవారాధకుల దాసత్వంలో గడిపినకారణంకాగా వారి హృదయాలలో విగ్రహారాధన యొక్క ఔన్నత్యం ఇంకా తిష్టవేసి ఉంది. అందువల్ల వారు తమ ప్రవక్తనే అడుగుతున్నారు, తమకోసం మంచిమంచి విగ్రహాలు తయారు చేయించి ఇవ్వమని! వారి మాటలు విని మూసా (అలైహిస్సలాం)కు చాలా విచారం కలిగింది.



"మీరు చాలా అజ్ఞానులుగా కనిపిస్తున్నారు. ఇంతకు క్రితమే మీరు వినాశానికి గురి అయిన వారిని కళ్ళారా చూశారు. మీరు చేస్తున్నవన్నీ వట్టి తప్పుడుపనులు, కాస్త ఆలోచించండి.

అల్లాహ్ మీకు దేవుని ఏకత్వం, ఇస్లామ్‌ల వెలుగునిచ్చాడు. ధ్వజవాహకులుగా పనిచేయడానికి ఆయన మిమ్మల్ని ‹ కున్నాడు. ఆ విధంగా మిమ్మల్ని సకల మానవులపై ఆధిక్య ప్రసాదించగోరుతున్నాడు. కాని మీరేమో మీకోసం అ కాకుండా మరోదైవాన్ని చేసిపెట్టమని నన్ను కోరుతునా అన్నారు హజ్రత్ మూసా (అలైహిస్సలాం).

అల్లాహ్ మానవుడ్ని మిగతా సృష్టికన్నా ఉత్కృష్టమ సృష్టిగా చేశాడు. మానవుడ్ని భూమిపై తన ఖలీఫా (ప్రతిని నియమించి పంపాడు. భూమిపైనున్న ప్రాణులన్నిటినీ సేవ కోసమే నియోగించాడు. అటువంటి స్థానం లభి తర్వాత అతడు రాళ్ళను మొక్కుతున్నాడంటే అంతకంటే దృష్టకరమేముంది? మానవుడు చెట్లను, జంతువులను, నదు కొండలను పూజిస్తున్నాడు. తన అవసరాలు తీరడానికి అల్లా వదలి ఆయన సృష్టి ఎదుట చేయిజాపుతున్నాడు.

బనీ ఇస్రాయీల్ ప్రజలు ముందుకు సాగారు. వారు బంజరు ప్రదేశాన్ని దాటుతున్నారు ఆ ప్రదేశంలో త్రాగేం నీరు కాని, తినడానికి ఆహారంగాని ఏమీ దొరకవు. అల్ల ప్రత్యేకవరంవల్ల వారికి త్రాగడానికి నీరు, ఆహారం ఏరా అయ్యాయి. అల్లాహ్ ఆజ్ఞతో మూసా (అలైహిస్సలాం) కొం నున్న ఒక రాతిని తన లాఠీతో కొట్టగా పన్నెండు నీటి ఊ బయల్పడ్డాయి. బనీ ఇస్రాయీల్ జాతిలోని పన్నెండు కు బాల వారికి ఒక్కో ఊట చొప్పున ప్రత్యేకించబడింది. ప ఎండ ఎక్కువయితే మబ్బునీడ వారికి చల్లదనాన్నిచ్చేది. ర

పూట జిగురువంటి పదార్థం ఆకాశాన్నుండి కురిసి వారి గుడారాలపై పేరుకునేది. దాన్ని 'మన్' అంటారు. చాలా రుచికరమయిన ఆహారం అది, ఇంకా 'సల్వా' అనే పరిగపిట్టలాంటి ఒక విధమైన పక్షులు ఎన్నో దొరకుతుండేవి. వీరు వాటిని పట్టి ఆహారంగా ఉపయోగించేవారు. తినడానికి మన్, సల్వాలు త్రాగడానికి నీరు వారికి లభించేవి.

ఒకవైపు వారికి దైవంచేసిన ఈ మేళ్ళున్నాయి. మరోవైపు మూసా (అలైహిస్సలాం) స్వాగతం, ఆయన ఇచ్చే శిక్షణ ఉండనే ఉన్నాయి, కానీ బనీ ఇస్రాయీల్ ప్రజలకు సవివరమయిన షరీఅత్ ఇంకా లభ్యం కాలేదు. ఫిరౌన్ పీడన నుండి విముక్తులయ్యాక వారికి గ్రంథం ఒసగబడుతుందని అల్లాహ్ వాగ్దానం చేసి ఉన్నాడు. మూసా (అలైహిస్సలాం) తన సోదరుడు హారూన్ (అలైహిస్సలాం)తో అన్నారు. "నీవు నా స్థానంలో నాజాతిలో నాకు ప్రతినిధిగా ఉండు. పరిస్థితుల్ని చక్కబరచడానికి ప్రయత్నిస్తూ ఉండు. దుర్మార్గుల మాటలు విని తప్పుత్రోవలో నడవకు. నేను తూర్ పర్వతం దగ్గరకి పోతున్నాను. అక్కడ నాకు సవివరమైన షరీఅత్ (గ్రంథం) ఇస్తానని అల్లాహ్ వాగ్దానం చేశాడు."

మూసా (అలైహిస్సలాం) ఈ బోధలుచేసి నిష్క్రమించారు. ఇక ఇక్కడేమయిందో చూడండి. ఈజిప్టు నుండి మూసా (అలైహిస్సలాం) వెంట "సామిరీ" అనే వ్యక్తికూడా వచ్చాడు. ఇతడు ఇప్పుడిప్పుడే ముస్లిం అయినవ్యక్తి. దైవ ధర్మంపట్ల విశ్వాసం, దేవుని ఏకత్వపు భావన అతని మనస్సులో ఇంకా నాటుకోలేదు. ఈజిప్టుప్రజలు గోపూజ చేసేవారని మీరు

చదివారుకదా. అటువంటి బహుదైవారాధకుల సాంగత్య
బనీ ఇస్రాయీల్ జాతిలోకూడ కాస్తోకూస్తో గోభక్తి ·
పోయింది. పైగా సామరీ వంటి ముష్రికుల సంతతికి చె
వ్యక్తి వారిలో ఉన్నాడు. మూసా (అలైహిస్సలాం) ప
తర్వాత అతనికి ఒక పెంకి ఆలోచన కలిగింది. అతడు
లందరినుంచి వెండి బంగారాలు ప్రోగుచేసి ఒక ఆవుదూడ
హం చేయించాడు :

అది అందమైన విగ్రహం. లోపలిభాగం డొల్లగా
అక్కడక్కడా కొన్ని రంధ్రాలు ఉండేలా తయారు చేయించ
ఆ రంధ్రాలగుండా గాలి వీచినప్పుడల్లా వింతశబ్దాలు వినవ
ఈ తమాషా చూడ్డానికి జనం తండోపతండాలుగా దానిచ
మూగసాగారు. విగ్రహం అందంగానూ వుంది. వింత
వుంది. సామిరీలో నక్కివున్న షైతాను వెలుపలికి వచ్చా
"ఇదేమిటనుకున్నారు ? "దైవం" మీకూ దైవమే, మూసా
హిస్సలాం)కూ దైవమే", అన్నాడు అతను.

సామిరీ చెప్పినదాంట్లో సమంజసత లేకపోయినా మన
షైతాను చోటుచేసుకుంటే, బుద్ధికూడా నశిస్తుంది. స్పష్ట
విషయంకూడ అర్థం కాకుండాపోతుంది. బనీ ఇస్రాం
ప్రజల పరిస్థితికూడా ఇలానే అయింది. ఎక్కడ దైవం? ఎ
బంగారు విగ్రహం? కాని విగ్రహారాధన, గోభక్తి హృదయా
తిష్టవేసి కూర్చుని, బుద్ధీ వివేచనల్నీ మింగివేశాయి ఈ
ఎటువంటి లాభాన్నిగాని, నష్టాన్నిగాని కలిగించజాలదని
నీసం ఆలోచించలేక పోయారు. మొత్తానికి కొందరు స
కాలంలో చిక్కుకొని ఆ ఆవుదూడ విగ్రహాన్ని పూజించసా

హజ్రత్ హారూన్ (అలైహిస్సలాం) వారి చేష్టలకు ఎంతో నొచ్చుకున్నారు. "చూడండి ఈ దూడ మీకొక పరీక్షయే కాని దైవం ఎలా అవుతుంది? మీ ప్రభువు కరుణామయుడైన అల్లాహ్ మాత్రమే, నా మాట వినండి. ఇటువంటి పనులకు దూరంగా ఉండండి," అంటూ ఆయన వారికి ఎంతగానో నచ్చజెప్పారు.

కాని మానవుడు మనసుకు తోచినట్లు నడుచుకుంటే, బుద్ధి జ్ఞానాలను ఉపయోగించకుండా నిర్ణయాలు తీసుకుంటే సన్మార్గాన్ని అనుసరించడం అతనికి అసాధ్యమయిపోతుంది. బనీ ఇస్రాయీల్ ప్రజలు అంతా వినడమయితే విన్నారు. కాని వారి ఆచరణమాత్రం యథాతథంగానే ఉంది. వారు తమ మనసుకు తోచినట్లు చేశారు. "సరే మూసా (అలైహిస్సలాం) తిరిగి వచ్చేవరకు ఈ దూడనే పూజిస్తూ ఉంటాం. ఆయన వచ్చాక అప్పుడు చూద్దాం" అన్నారు వారు.



# బహుదైవారాధనను వీడలేని
# బనీ ఇస్రాయీల్

మూసా (అలైహిస్సలాం) తూర్ పర్వతంపై ముప్పయి రోజులు ఉండే ఉద్దేశ్యంతో వెళ్ళారు. కాని అక్కడ ఆయన నలభయి రోజులు ఉండవలసి వచ్చింది. అక్కడ అల్లాహ్ ఆయనతో సంభాషించాడు. మూసా (అలైహిస్సలాం) కోరికపై తన జ్యోతినికూడ కాస్తచూపాడు. మూసా (అలైహిస్సలాం) దాన్ని భరించలేకపోయారు. విశ్వప్రభువు యొక్క బ్రహ్మాండమైన ఈ జ్యోతిని కృటికాలం చూడగానే ఆయన సొమ్మసిల్లిపోయారు. స్పృహరాగానే తన తప్పిదాన్ని గ్రహించి అల్లాహ్‌ను క్షమాపణ వేడుకున్నారు.

ఆ తరువాత మూసా (అలైహిస్సలాం)కు 'తౌరాత్' గ్రంథం ఇవ్వబడింది. తౌరాత్, ఫలకాలపై వ్రాయబడింది. అందులో అన్నిరకాల ఆజ్ఞలు, హితవులు సవివరంగా పొందు

పరచబడ్డాయి. అల్లాహ్ ఆజ్ఞాపించాడు, "తౌరాత్‌ను తీసుకు వెళ్ళు ఇందులోని ఆజ్ఞలను గట్టిగా ఆచరించు. వీటిపై నీ తెగవారినికూడా స్థిరంగా ఉండమని చెప్పు."

ఈ భాగ్యం పొందాక మూసా (అలైహిస్సలాం) ఆనందం అవధులు దాటించె. విశ్వాసి అయిన దాసుడికి తన ప్రభువు ఆజ్ఞలను పాలించడమే ఎంతో సంతోషదాయకమైన విషయం. అతను ఆ ఆజ్ఞలను కష్టమయినవిగా ఎన్నటికీ భావించడు. కాని ఈ సంతోష సమయంలో ఆయన విచారకరమైన విషయంకూడా వినవలసివచ్చింది." "నీవులేని సమయంలో నీతెగవారు ఏకేశ్వరో పాసన, దైవభక్తి పరీక్షలో ఓడిపోయారు, అని అల్లాహ్ ఆయనకు తెలియజేశాడు. వారు ఆవుదూడను దైవంగా చేసుకున్నారు. ఈ సంగతివిని మూసా (అలైహిస్సలాం)కు చాలా దుఃఖం కలిగింది. తన తెగవారిపై చెప్పలేనంత కోపం వచ్చింది.

మూసా (అలైహిస్సలాం) తన తెగవారి దగ్గరకు తిరిగి వచ్చారు. రాగానే "ఏమిటి మీరు చేసినపని ? మీ ప్రభువు మీకు ఎటువంటి మేళ్ళను గురించి వాగ్దానంచేశాడో గుర్తులేదా? ఎంతోకాలం గడచిపోయిందనా మీరిటువంటి చర్యలకు పాల్పడ్డారు ?" అని గద్దించారు ఆయన.

తెగవారు ఇలా జవాబిచ్చారు, "లేదులేదు. మేము ఆ వాగ్దానాలను మరచిపోలేదు. కాని జరిగిందేమంటే మేము ఈజిప్టునుంచి తెచ్చుకున్న పెద్ద పెద్ద నగలను ధరించడం మానేశాం. సామిరీ వాటిని తీసుకెళ్ళి కరగబెట్టి ఆవుదూడ విగ్ర

హాన్ని తయారు చేశాడు. అది మాట్లాడుతుంది కూడా. ఇదే మాదైవమని, మూసా (అలైహిస్సలాం) దైవంకూడా అని సామిరీ చెప్పాడు అందువల్ల మేందాన్ని పూజించడం ఆరంభించాము."

ఇక మూసా (అలైహిస్సలాం) తన సోదరునివైపు తిరిగారు, కోపంతో వూగిపోతూ ఆయన జుట్టు పట్టుకొని "హారూన్! ఇలా చేస్తుంటే వాళ్ళని నీవు వారించలేదా? నా ఆజ్ఞ అంటే నీకు లెక్క లేకుండా పోయిందా? వాళ్ళు భ్రష్టులవుతుంటే చూస్తూ ఊరుకున్నావా?" అని గద్దించారు. హజ్రత్ హారూన్ (అలైహిస్సలాం) జవాబుగా, "లేదు, నేను చెప్పేది కాస్త విన్పించుకో. నీవు నా జుట్టు, గడ్డం పట్టుకొని నాపై కేకలు వేస్తూ నా శత్రువులు నన్ను పరిహసించే అవకాశాన్ని కల్పించకు. అసలు విషయం అది కాదు. నేను వారిని ఎన్నోసార్లు వారించాను. కాని నా మాట ఒక్కటీ వారు పట్టించుకోలేదు! పైగా వారు నన్ను చంపడానికి సిద్ధపడ్డారు. నా ప్రాణం గురించి నాకు లెక్క లేదు. నేనీ విషయంలో కఠిన వైఖరి అవలంబించక పోవడానికి కారణం, నేను బనీ ఇస్రాయీల్ తెగలో చీలిక తెచ్చానని, నే వచ్చేదాకా ఆగనయినా లేదని నీవంటావేమోనని భావించాను. నేను నీ రాకకై ఎదురు చూస్తున్నాను. నేనీ పాపాత్ములతో చేరి పోయానని భావించకు."

మూసా (అలైహిస్సలాం), పరిస్థితిని అర్థం చేసుకున్నారు. ఆయన తనవల్ల, తన తమ్మునివల్ల జరిగిన పొరపాట్లకు అల్లాహ్ దగ్గర క్షమాపణ వేడుకున్నారు. తర్వాత ఆయన సామిరీ వైపు తిరిగి "నీ సంగతేమిటో చెప్పు. నీకేమొచ్చిందని ఇలా చేశావు?"

అని అడిగారు. సామిరీ తన ప్రాణం కాపాడుకోవడం కోసం చటుక్కున ఒక కథ అల్లాడు. తన వంకితనానికి పుణ్యకార్యపు రంగు పులుముతూ "నేను ఇతరులెవరూ చూడని ఒక దృశ్యాన్ని చూశాను. ఫిరౌన్ సైన్యం మన వెంటబడినప్పుడు నేను హజ్రత్ జిబ్రీల్‌ని చూశాను. ఆయన ముందు ముందు నడచిపోతున్నారు. నేలపై ఆయన గుర్రపు గిట్టలు తాకిన చోటల్లా గడ్డి మొలవసాగింది. నేను గుర్రపు గిట్టలు తాకిన మట్టిని ఒక గుప్పెడు తీసుకున్నాను. నగలతో దూడ విగ్రహం చేసేటప్పుడు ఈ మట్టినికూడా ఉపయోగించాను. దాంతో ఆ విగ్రహం మాట్లాడసాగింది. నా మనస్సుకు ఈ విషయమే తట్టింది." అన్నాడు.

హజ్రత్ మూసా (అలైహిస్సలాం) సామిరీ చెప్పిన ఈ కట్టుకథ విన్నారు. వెంటనే అతని విషయంలో ఒక ఆజ్ఞను జారీ చేశారు. "ఇవాల్టినుండి సామిరీతో ఎవరూ ఎటువంటి సంబంధం పెట్టుకోరాదు. తానొక వెలివేయబడ్డ వాడ్నని అతనికి తెలిసి రావాలి పరలోకంలో వాడికి శిక్ష ఉండనే ఉంది. అది మాత్రం ఏ విధంగానూ తప్పదు" అన్నారు ఆయన. మళ్ళీ సామిరీతో, "నీవు దేనిపూజ అయితే ప్రారంభించి, దానికి లేని పవిత్రతను ఆపాదించావో దాని గతిచూడు. నీ ఎదుటే దాన్ని కాల్చి మసిచేసి సముద్రంలో పారవేయడం జరుగుతుంది' అన్నారు ఆయన.

తర్వాత హజ్రత్ మూసా (అలైహిస్సలాం) అక్కడ వారిని సంబోధించి, ఇలా చెప్పారు, "సోదరులారా! మీ c మాని అల్లాహ్ మాత్రమే. ఆయన తప్ప ఆరాధనకు, విధేయ అర్హులు ఎవరూ లేరు. ఆయనే మీ ప్రభువు. ఆయన జ్ఞా సర్వత్రా వ్యాపించి ఉంది. ఇటువంటి విగ్రహాలు దేవత అవుతాయి? ఈ దూడలో ఏముంది? అందులో అ ఎలాంటి పవిత్రతగాని, మహిమగాని లేదు. ఇది ఎటువ లాభాన్నిగాని, నష్టాన్నిగాని కలిగించజాలదు. మేము ఇప దాన్ని కాల్చి మసి చేసేస్తాం. ఎక్కడయినా దైవానికి ఇలా దుర్గతి పడుతుందా?"



# తలబిరుసుతనం తెచ్చిన తంటా

సామిరీకి శిక్ష సంగతి వినిపించి ఆయన తన తెగవారి కోసం దైవ సమక్షంలో వారి అపరాధాలకు క్షమాభిక్ష కోరారు. అల్లాహ్ ఆయన దుఆను స్వీకరించాడు. అయితే ఒక షరతు విధించాడు. "ఎవరయితే దైవానికి సహవర్తుల్ని నిలబెట్టారో వారి మార్గభ్రష్టత్వానికి శిక్షగా తెగవారే వారిని తమ చేతులతో చంపాలి. తద్వారా తెగ మొత్తానికి అంటిన దైవ తిరస్కారం, షిర్క్‌ల మచ్చ మాసిపోతుంది.

ఈ ఆజ్ఞను వెంటనే అమలుపరచడం ప్రారంభమయింది. బనీఇస్రాయీల్ ప్రజలు చాలామంది మృత్యువాతన పడ్డారు. హజ్రత్ మూసా (అలైహిస్సలాం) తిరిగి దయాభిక్ష కోసం దైవాన్ని ప్రార్థించారు. అప్పుడు తేలికపాటి నేరం చేసిన వారిని క్షమించి విడిచిపెట్టడం జరిగింది. ఇక షిర్క్, ఎప్పుడు 'షిర్క్' దరిదాపులకు పోవద్దని హెచ్చరించడం జరిగింది.

బానిసబతుకు ఇస్లామీయ జీవిత విధానానికి పొసగదు. ఇస్లామ్ మానవుణ్ని అన్నివిధాల బానిసత్వాన్నుండి వెలికితీసి కేవలం ఒకే దేవుని దాసునిగా చేస్తుంది. అందుచేతనే ముస్లిమ్‌లకు బానిస బ్రతుకు బ్రతకవలసి వచ్చినప్పుడల్లా ఇస్లాంతో వారి సంబంధం బలహీనమే అవుతూపోయింది. ఇక కాఫిర్లు, ముష్రికుల (దైవ ధిక్కారులు, బహు దైవారాధకుల)కు చేసే బానిసత్వం ఇంకా ప్రమాదకరంగా ఉంటుంది. ఎన్నో దైవధిక్కారానికి సంబంధించిన విషయాలు, బహుదైవారాధనా భావాలు మెల్ల మెల్లగా వారి హృదయంలో చోటుచేసుకుంటాయి. ఫలితంగా తన విశ్వాసానికి ఎటువంటి చీడపడుతూ ఉంటుందో మోమిన్‌కి తెలియనే తెలియదు. కొద్ది దినాల్లోనే అతడు ఎన్నో ఇస్లామ్ వ్యతిరేక విషయాలు అవలంబిస్తాడు. బనీ ఇస్రాయీల్ ప్రజల స్థితి అచ్చం ఇలాగే అయింది. ఫిరౌనీయుల చేతిక్రింద బానిసలుగా చాలా కాలంగా ఉన్న కారణాన వారిలో ఎన్నో చెడులు చోటు చేసుకున్నాయి. హజ్రత్ మూసా (అలైహిస్సలాం) ఇప్పుడు ఈ చెడులనన్నింటినీ దూరం చేయడానికి పూనుకున్నారు. బనీ ఇస్రాయీల్ ప్రజలకు ఉన్నత ఇస్లామీయ విద్యా - శిక్షణలు ఏర్పాటు చేశారు. వారు తమ దైనందిన కార్యాలు చూసుకునేందుకు వీలుగా మూసా (అలైహిస్సలాం) వారిని పన్నెండు విభిన్న వర్గాలుగా విభజించారు. ప్రతి వర్గానికి ఒక పర్యవేక్షకుని నియమించారు. ఇస్లాంకు వ్యతిరేకంగా కనబడే ఏ విషయంలోనయినా వారిని హెచ్చరిస్తూ, వారి పర

స్పర సంబంధాలను మెరుగుపరచడానికి తగిన మార్గదర్శకత్వం వహించే బాధ్యతకూడా ఆ పర్యవేక్షకులపై మోపారు.

బనీ ఇస్రాయీల్ ప్రజలు ఫిరౌనీయులతో సహజీవనం చేసి ఎంత దిగజారిపోయారో, అలాంటి వారి సంస్కరణకు మూసా (అలైహిస్సలాం)కు ఎంత కృషి చేయవలసి వచ్చిందో ముక్తసరిగా తెలుసుకుందాం.

తౌరాత్ గ్రంథం లభించిన తర్వాత జరిగిన సంఘటన. వారిలో కొందరు మూసా (అలైహిస్సలాం)తో "మాకు దైవాన్ని చూపండి. ఆయన మీకు తౌరాత్ ఇస్తూ దానిప్రకారం ఆచరించమని ఆదేశిస్తున్న సన్నివేశాన్ని మేము ప్రత్యక్షంగా చూస్తాము" అన్నారు.

చూశారా వారి తలబిరుసుతనం! దేవుని ఉనికి, ఆయన గుణగణాల గురించిన వాస్తవిక జ్ఞానంలేని కారణంగానే వాడు అలా అడుగుతున్నారు. ఈజిప్టు ప్రజలు తమ దేవతల విషయంలో భావించినట్లే వీరు అల్లాహ్ విషయంలో కూడా భావిస్తున్నారు.

గోవుయొక్క ఔన్నత్యం, దానిపట్ల గౌరవభావం వారి హృదయాలలో కొద్దోగొప్పో ఇంకా తిష్టవేసుకునే ఉంది. ఈ జాడ్యంమూలానే వారు ఆవుదూడను పూజించడానికి పాల్పడ్డారు. కాబట్టి వారి హృదయాలలో నాటుకుపోయిన ఈ భావాన్ని పూర్తిగా తొలగించాల్సిన అవసరముంది. అల్లాహ్ ఆజ్ఞతో

మూసా (అలైహిస్సలాం) "మీరొక గోవును జిబహ్ చేయండి" అని ఆదేశించారు వారిని. కాని వారాపని నుండి తప్పించుకో డానికి రకరకాల సాకులు వెదికారు. "దానిరంగు ఎలా ఉం డాలి ?" అని ఒకసారి. "గోవు ఎలాంటిదై ఉండాలి ?" అని మరోసారి ప్రశ్నలు వేశారు. నిజానికి అల్లాహ్ ఆజ్ఞ వినగానే గోవును ఖుర్బానీ ఇవ్వడానికి సిద్ధపడవలసింది. కాని దైవాజ్ఞల గొప్పతనం మనస్సులో నాటుకోనంతవరకు మనిషి ఇటువంటి ప్రశ్నలే వేస్తుంటాడు. చివరకు మూసా (అలైహిస్సలాం) వారడిగిన అన్ని ప్రశ్నలకు జవాబిచ్చి గోవు ఎలాంటిదయి ఉండాలో తెలియజేసిన తర్వాతనే వారు తప్పనిసరియై గోవును ఖుర్బానీ చేశారు. లేకపోతే వారు ఖుర్బానీ ఇచ్చేవారా ?

హజ్రత్ మూసా (అలైహిస్సలాం)ను అల్లాహ్ ఆజ్ఞాపించాడు, "బనీ ఇస్రాయీల్ ప్రజలను పాలస్తీనా (పవిత్ర భూమి) తీసుకువెళ్ళు. అక్కడ వారు వృద్ధీవికాసాలు చెందుతారు. వారికి అక్కడమేము అధికారాన్ని, నాయకత్వాన్ని ప్రసాదిస్తాము. ఇది మా వాగ్దానం."

కాబట్టి మూసా (అలైహిస్సలాం)తన తెగవారితో అన్నారు:

"సోదరులారా ! అల్లాహ్ ఎల్లప్పుడూ మిమ్మల్ని కటాక్ష వీక్షణలతోనే చూశాడు. ఈ విషయం మీకు బాగా తెలుసు. మీలో కొందరిని తన ప్రవక్తలుగా చేశాడు. కొందరికి అధికారం ఇచ్చాడు. ప్రపంచంలో ఎవరికీ లభించని మహాభాగ్యాన్ని మీకు ప్రసాదించాడు. అంటే మిమ్మల్ని దైవ ధర్మ ధ్వజవాహ

కులుగా చేశాడు. అంచేత ఆయన ఇప్పుడు మిమ్మల్ని పాలస్తీనా వెళ్ళి అక్కడ దైవ ధర్మాన్ని సంస్థాపించమని ఆజ్ఞాపిస్తున్నాడు. ఈ బాధ్యతను తిరస్కరించినట్లయితే మీరు ఘోరంగా నష్ట పోతారు."

ఇది విని కొందరు పాలస్తీనా వెళ్ళడానికి అంగీకరించారు. కొందరు తటపటాయించసాగారు. వారి భీరత్వాన్ని చూసి ఇద్దరు ధైర్యశాలురు పాలస్తీనాలో ప్రవేశించడానికి మార్గాలు సూచించారు. అల్లాహ్‌పై భరోసా ఉంచవలసినదిగా వారికి హితవు చేస్తూ, విజయం తమనే వరిస్తుందని వారిలో ధైర్యాన్ని కలిగించారు కాని శతాబ్దాల తరబడి బానిసత్వం అనుభవించిన ఈ జాతి దైవప్రవక్త ఆజ్ఞను అంత తేలిగ్గా పాటిస్తుందా ? పైగా వారికిస్తున్న శిక్షణకూడా పూర్తికాలేదు, అటువంటి జాతి ప్రాణా లకు తెగించి ముందడుగు వేస్తుందని ఎలా ఆశించగలం ?- ఆ పిరికిపందలు పాలస్తీనా బయలుదేరడానికి తిరస్కరించారు "అయ్యా ! మేము మాత్రం అక్కడికి రాము. కావాలంటే మీరూ, మీదైవం వెళ్ళి పాలస్తీనా వారితో తలపడండి. మేమ యితే ఇక్కడే ఉంటాం. మీరు యుద్ధంలో గెలిచి, శత్రువుల్ని పూర్తిగా తరిమివేశాక— అప్పుడు వస్తాం మేము" అన్నారు వారు.

తన తెగవారి మాటలు విన్న మూసా (అలైహిస్సలాం) దుఃఖం పొర్లివచ్చింది. అల్లాహ్‌ను ప్రార్థించారు, "ప్రభూ నా సోదరుడు, నావంశస్థులు తప్ప నా మాట ఎవరిమీదా చెల్లదు

ఇక ఈ మూర్ఖజాతిపై నీపట్ల వారు కనబరచిన అవిధేయత కారణంగా ఏదయినా శాపంవస్తే దాన్నుండి మమ్మల్ని కాపాడు." దైవాజ్ఞ అయింది. "మరో నలభయి ఏళ్ళవరకు వారికి ఈ పవిత్రభూమిపై పాదం మోపే అవకాశం లేదు. ఇక్కడే దిక్కు తోచక తిరుగుతూ ఉంటారు."



# ప్రవక్త హితబోధ

ఈ నలభయి ఏళ్ళ కాలంలో కొత్తతరం వచ్చింది. ఈ తరంలోని వారెవరూ బానిసత్వం, దైవ తిరస్కారపు వాతావరణంలో జీవితం గడపలేదు. పైగా వారి పోషణ స్వేచ్ఛాయుత స్థామాయ వాతావరణంలో సాగింది. అలాహ్ ధర్మ సంస్థాపనా కార్యం ఈ తరం వారిచేత చేయించాడు.

మొత్తం మీాద ఇటువంటి ఎన్నో దుశ్చర్యలవల్ల మూసా (అలైహిస్సలాం)కు ప్రతిరోజూ ఏదో ఒక రకంగా మనస్తాపం కలుగుతూనే వచ్చింది. కాని ప్రవక్త తన సమాజం పాలిట కారుణ్యమూర్తిగా ఉంటాడు. సమాజం పట్ల ప్రవక్త హృదయంలో ఉండే ప్రేమ ఇతరులలో ఉండదు. హజ్రత్ మూసా (అలైహిస్సలాం) కూడా తన తెగవారి దుశ్చర్యలన్నింటిని సహిస్తూ వారి శిక్షణాసంస్కరణలకార్యంలో నిమగ్నులయ్యారు.

హజ్రత్ మూసా (అలైహిస్సలాం) ఇచ్చిన ఈ శిక్షణ పర్యవసానంగానే శతాబ్దాల తరబడి బానిసత్వంలో మగ్గినా బహుదైవారాధనా వాతావరణంలో గడిపి తమ శక్తిసామర్థ్యాలను కోల్పోయినా బనీ ఇస్రాయీల్ జాతి ప్రపంచ నాయకత్వపు ఉన్నత శిఖరాలను అందుకోగలిగింది. మానవాళికి మహోన్నత దైవదత్త జీవనవ్యవస్థ. అది ప్రసాదించే వరాలతో తులతూగే మహాభాగ్యం లభించింది.

హజ్రత్ మూసా (అలైహిస్సలాం)ను గురించిన సంఘటనలు పూర్తికావచ్చాయి. దాదాపు 120 ఏండ్ల వయస్సు వచ్చే వరకు ఆయన దైవదౌత్య బాధ్యతను నెరవేర్చారు. ఈ వ్యవధిలో బహు దైవారాధకులకు, దైవధిక్కారులకు దైవ సందేశం అందచేయటానికి, ఫిరౌన్ వంటి రాజుతో తలపడటానికి, బనీ ఇస్రాయీల్ భ్రష్టజాతిలో దైవంపట్ల విశ్వాసాన్ని జాగృతపరచి, దాన్ని పటిష్టంచేసి వారి పరిపూర్ణ సంస్కరణకోసం ఏమేమి చేశారో ఆ

వైనం పూర్తి వివరంగా చెప్పడం సాధ్యంకాదు. అయి
సంక్షిప్త స్వరూపం మీ ముందుకు వచ్చింది. ఇస్లా
ఉద్యమం చేపట్టడం, దాని ఉన్నతికోసం ఎటువంటి స
లలో ఎలా ముందుకుసాగాలో, ఎటువంటి కష్టాలను సహి
మీకు అర్థమైంది. హజ్రత్ మూసా (అలైహిస్సలాం)
సంఘటనలలో మనకోసం ఎన్నో హితబోధలు, గు
ఉన్నాయి. అందుచేతనే పవిత్ర ఖుర్ఆన్‌లో హజ్రత్
(అలైహిస్సలాం)కు చెందిన సంఘటనలు తరచుగా ఉ
బడ్డాయి.

ఇబ్రాహీం సూరాలో ఆ హితబోధలలో ఒకభాగ
కంగా ఇలా ఉదహరించబడింది. "మేము మూసా (
స్సలాం)కు మా నిదర్శనాలను ఇచ్చి పంపాము. ఎం
ఆయన తన జాతివారిని చీకట్లనుండి వెలికితీసి వెల
తీసుకురావాలని". ఈ చీకట్లు ఏవి ? దైవ తిరస్కారం
దైవారాధన, దైవంపట్ల అవిధేయత అల్లాహ్ తప్ప ఇతరుల
బానిసత్వం, ఇంకా ఇస్లాంనుండి మార్గదర్శకత్వం స్వీక
మానవుడ్ని చుట్టుముట్టే ఇతర అంధకారాలు. వాటిను
ఇస్రాయీల్ ప్రజలను బయటికి తీసి వెలుగులోకి తీసుకు
ఎటువంటి వెలుగు అది ! దైవధర్మజ్యోతి. అల్లాహ్ చ
ఒడ్డ హితబోధల వెలుగు అది ఎటువంటి వెలుగు అ
ఇహలోక జీవితప్రయాణంలో వచ్చే ఎదురుదెబ్బలనుండి
షిని కాపాడటమేకాక పరలోక సాఫల్యానికి గొనిపోయే వ

కూడా సుగమం చేస్తుంది. తద్వారా అతనికి శాశ్వత జీవితం యొక్క వాస్తవమైన సుఖశాంతులు ప్రాప్తమవుతాయి.

ప్రజలు గుణపాఠం గ్రహించేందుకు వారికి మానవ చరిత్రలోని ముఖ్యసంఘటనలు కూడా వినిపించమని అల్లాహ్ హజ్రత్ మూసా (అలైహిస్సలాం)కు చెప్పాడు. అల్లాహ్ గత జాతులకు వారి కర్మలనుబట్టి శిక్ష లేదా సత్ఫలాన్ని ఇచ్చాడు. చరిత్రాత్మకమైన ఆ సంఘటనల్లో గల నిదర్శనాలవల్ల మనిషికి తౌహీద్ (దేవుని ఏకత్వం)సత్యమని నిరూపించే సాక్ష్యాధారాలు, మంచివారికి చెడ్డవారికి పట్టేగతి ఒక్కలా ఉండదనడానికి కావలసిన ఋజువులుకూడా ఉన్నాయి. మనిషి బుర్రకు పనికల్పించి ఆలోచిస్తే ఏఏ జాతులు, వ్యక్తులయితే భ్రష్ట విశ్వాసాలతో తప్పుడు భావాలతో జీవితం గడిపారో వారికి ఎలాంటి గతి పట్టిందో (ఆ సంఘటనల ద్వారా) మనిషి తెలుసుకోగలడు. ఈ చారిత్రక సంఘటనల్లో గ్రహించేవారికి అసంఖ్యాకమయిన గుణపాఠాలు ఉన్నాయి. అయితే ఇవన్నీ ఓర్పు, కృతజ్ఞతా భావాలు కలవారికే ప్రయోజనం చేకూర్చుతాయి. ఒకవ్యక్తి దేవునివరాలను గుర్తించి వాటిని సద్వినియోగమే చేసుకుంటే అతడు వాటితో ఎలాప్రయోజనం పొందగలడు ? ఇదే విధంగా దైవాజ్ఞల విషయంలో మనో వాంఛల్ని అణచలేనివాడు, ఆ ఆజ్ఞల పాలనలో ఎదురయ్యే కష్టనష్టాలను ఎదుర్కోడానికి సిద్ధపడని వాడిముందు ఎన్ని గుణపాఠాలు, హితబోధలు వచ్చినా వ్యర్థమే అవుతాయి.

హజ్రత్ మూసా (అలైహిస్సలాం) తన తెగ వారితో పలికారు, "సోదరులారా! అల్లాహ్ మీపై చేసిన మేలును గుర్తుంచుకోండి. ఆయన మీకు ఫిరౌన్ బారినుండి విముక్తిక లిగించాడు. ఆ ఫిరౌన్ మిమ్మల్ని కఠినంగా బాధించేవాడు. మీ మగ పిల్లల్ని చంపివేసేవాడు. మీ స్త్రీలను వెట్టిచాకిరి కోసం బ్రతుక నిచ్చేవాడు. ఈ విషయాలను మీ ప్రభువు తరఫున మీకు ఒక పెద్ద పరీక్షగా చేయడం జరిగింది. కాని ఇప్పుడు, ఆయన మీకు సుఖశాంతులు ప్రసాదించాడు. రకరకాల వరాలను ప్రసాదించాడు. మీకు హితోపదేశం చేశాడు కాబట్టి అందుకు మాటలతోను, చేతలతోను కృతజ్ఞత చూపడం మీ విధి "మీరు ఆయన ఇచ్చిన వరాలకు కృతజ్ఞతలు చెల్లిస్తే మేము మీకు మరిన్ని వరాలిస్తాము. ఒకవేళ కృతఘ్నులవుతే. గుర్తుంచుకోండి మా శిక్షకూడా కఠినంగానే ఉంటుంది" అని స్పష్టంగా చెప్పిన మీ ప్రభువు మాటలు గుర్తుంచుకోండి.

ఒక మనిషి రెండో మనిషికి ఉపకారం చేస్తే దానికి బదులుగా అతడు తన ఉపకారికి తిరిగి కొంతయినా సరే ప్రత్యుపకారం చేసే అవకాశం ఉంది. కాని అల్లాహ్ అంతకంటే ఎంతో ఉన్నతుడు కదా! ఆయన పనికి తోడ్పాటునిచ్చేవారు కాని, ఆయనకు మేలుచేసేవారు కాని ఎవరూ ఉండలేరు. ఆయన అన్నిరకాల అవసరాలకు అతీతుడు. ఎటువంటి సహాయమూ అక్కరలేనివాడు. కాబట్టి ఆయన వరాలను గౌరవించాలి. వాటిని దైవేచ్ఛ కనుగుణంగా వినియోగించాలి. దైవాజ్ఞల ప్రకారం ఆచరించి ఆయన్ని ప్రసన్నుడ్ని చేసుకోవాలి. ఇదే

ఆ వరాలకు కృతజ్ఞత చూపడం అంటే. ఆ కృతజ్ఞతాభావం మనసులో ఎప్పుడూ ఉండాలంటే ఆయన్ని స్తుతించాలి. కృత జ్ఞతా వాక్యాలు ఆలోచించి, అర్థం చేసుకుని ఉచ్ఛరించడం మరీ అవసరం.

ఈ విధంగా కృతజ్ఞతలు చెల్లించడం వల్ల అల్లాహ్‌కు ఒరిగేదేమీ లేదు. అయన అన్ని రకాల లాభాలకు అతీతుడు. ఆ లాభంకూడా కృతజ్ఞతలు చెల్లించిన వ్యక్తికే లభిస్తుంది. తత్ఫలితంగా అతనికి లభించే దేవుని వరాలు అధికమవుతాయి. ఇంకా అతనికి ఇహపరాల సాఫల్యాలుకూడా లభ్యమవుతాయి. అటువంటి మహోపకారి విషయంలో తిరుగుబాటు వైఖరి అవలంబించేవారు, ఆయన ఇచ్చిన వరాలను తప్పుడు పద్ధతులలో, తప్పుడు మార్గాలలో వినియోగించేవారు, ఆయన ఆజ్ఞల్ని జవదాటేవారు, ఆయన హితవులను పెడచెవిన పెట్టేవారు అల్లాహ్‌కు ఏ విధంగానూ చెరుపు చేయలేరు. వీరు తమకే నష్టం కలిగించుకుంటున్నారు. ఎందుకంటే ఎవరు కృతజ్ఞతలు చెల్లించినా, ఎవరు వినయ విధేయతలు చూపినా వాటివల్ల అల్లాహ్‌కు ఎలాంటి ప్రయోజనం చేకూరదు. మూసా (అలైహిస్సలాం) స్పష్టంగా చెప్పారు, "మీరు తిరస్కార వైఖరిని అవలంబిస్తే, భూమిపైనున్న వారంతా కాఫిర్లు అయిపోయినా అల్లాహ్ దాన్ని ఖాతరు చేయడు. ఒకరు ప్రశంసించినా, ప్రశంసించకపోయినా ఆయన స్వయంగా ప్రశంసనీయుడు, ఏ ఒక్కడి పొగడ్తల అవసరమూ ఆయనకు లేదు. ఒకరు తనను

పొగడాలనే కోరిక లేదాయనకు. ఆయన స్వీయ గుణగణాలు కలవాడు. అవి శాశ్వతమయినవి. తాత్కాలికమూ, ఇతరుల చేత ఇవ్వబడినవి ఎంతమాత్రమూ కావు.

మూసా (అలైహిస్సలాం) చేసిన ఈ ప్రసంగం అధిక భాగం 'తౌరాత్' గ్రంథంలో ఉంది. దాన్ని చూసినట్లయితే, బనీ ఇస్రాయీల్ వారి శిక్షణా సంస్కరణలకు మూసా (అలైహిస్సలాం) ఎటువంటి విధానాలను అవలంబించారో అర్థం కాగలదు. ఆ ప్రసంగంలో నొక్కి చెప్పబడిన ముఖ్య విషయాలు :

★ అల్లాహ్‌ను మనస్ఫూర్తిగా ప్రేమించండి. ఆయన చేసిన మేళ్ళను గుర్తుంచుకోండి. ఆయన ఇచ్చిన వరాలను మరచిపోకండి.

★ చిత్తశుద్ధితో, పూర్తి అంగీకారంతో దైవదాస్యంపై స్థిరంగా ఉండండి.

★ అల్లాహ్‌ను ప్రేమించే, ఆయన ఆజ్ఞలను పాలించే హితవు మీకు ఇవ్వబడుతూంది. దాన్ని మీ సంతానాని కూడా బోధించండి. తద్వారా మీ తర్వాత మీ వంశంలో పుట్టేవారు అల్లాహ్‌కు విధేయులే కావాలి. అవిధేయులు, తిరస్కారులు కారాదు.

★ ఇంట్లో ఉన్నా, దారిన పోతూవున్నా, కూర్చుని ఉన్నా, పడుకుని ఉన్నా అల్లాహ్ ఆజ్ఞల్ని, హితవుల్ని మననం చేసుకుంటూ ఉండండి—అంటే సందేశ ప్రచార బాధ్యతను నెరవేర్చాలి.

★ దైవ వాణిని విని ఆ ప్రకారంగా ఆచరిస్తే మీకు శుభాలు కలుగుతాయి. పట్టణంలో ఉన్నా పల్లెల్లో వున్నా సరే. మీ విరోధులకు అపజయం కలుగుతుంది. మీరు చేసే ప్రతి పనిలోనూ శుభం కలుగుతుంది.

(సమాప్తం